శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౧. { చిత్రభాను. చైత్ర—ఆషాఢములు. } సంచిక ౧-౨.

## స్వవిషయము.

వృషసంవత్సరముతోఁ బరిషత్పత్త్రికకు ముప్పది సంవత్సరములు గడచినవి. ముప్పదియొకటవ సంవత్సరము ప్రారంభమయినది. పాఠకుల యొక్కయు నఖిలాంధ్రలోకముయొక్కయు నాదరముచేఁ దననియమముల ననుసరించి తనశక్తి కొలఁది పరిషత్తు భాషాసేవఁ జేయుచున్నది.

గతసంవత్సరమునఁ బ్రకటింపఁబడిన సంచికలలో సీతారామచరిత్రము బాలకాండము ముగింపఁబడినది. మిగిలిన భాగములును గడు శీఘ్రముగఁ బ్రకటింపఁబడును. భాండాగారమునఁ గల తాళపత్త్రప్రతులను బరిశోధించి, యందలి ఛందోవ్యాకరణాది గ్రంథములను గూర్చిన విశేషవిషయములు 'పరిషత్పుస్తకభాండాగార' మను పేరఁ బ్రకటింపఁ బడుచున్నవి. (Descriptive catalogue) ప్రబంధములనుగూర్చిన భాగ మీసంవత్సరమునఁ బ్రకటింతుము. మఱియు నిశ్శంక కొమ్మనామాత్య విరచితమగు శివలీలావిలాసమున రెండాశ్వాసములు మాత్రమే దొరకి

నవి. అందును బీఠికాభాగము సరిగలేదు. మిగిలిన గ్రంథమును శిథిలప్రాయమై యుండుటచేత నద్దానిముద్రణ మీసంచికలో మొదలిడితిమి. శుద్ధమగు ప్రతులు లభించునేని శేషించిన యాశ్వాసములు ముందు ప్రకటింతుము. శివలీలావిలాసము వ్రాఁతప్రతులుగాని తాళపత్త్రప్రతులుగాని యెచటనైన నున్నచో మాకుఁ దెలుపుటకై పాఠకులను వేఁడుచున్నాము. యుద్ధపరిస్థితులవలనఁ గాగితముధర పెఱుగుటయేగాక వలయుకాగితము లభించుటలేదు. పత్త్రికను ముద్రించుటలోఁ గల యాలస్యమును జందాదారులును బాఠకులును క్షమింతురు గాక.

శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురము మహారాజావారిచే శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు ప్రకటింపఁబడుచుండు టందఱకును విదితమే. రెండుసంపుటము లిదివఱలో వెలువడినవి. 'చ' మొదలు 'త' అను నక్షరము తుదివఱకు మూఁడవ సంపుటముగ నచిరకాలముననే వెలువడునని తెలుపుచున్నాము. యుద్ధమువలన నెట్టియంతరాయములు గలుగుచున్నను శ్రీవారు దమసహజమగు భాషాభిమానముతోడను, ఔదార్యముతోడను నిఘంటునిర్మాణమును గొనసాగించుట మనము ప్రశంసింపవలసియున్నది.

ఆర్థికరాజకీయరంగముల వాతావరణమెట్లు కొన్నిసమయముల నల్లకల్లోలముగ నుండి కాలక్రమమునఁ బ్రశాంతినిఁ జెందునో యట్లే భాషాప్రపంచమునఁగూడ సంభవించుటయుఁ గలదు. అట్టికాలములను బాశ్చాత్యులు సంధియుగము (Transition periods) లని వచింతురు. ఆసమయమున నాందోళనము విపరీతముగ నుండుటయేగాక, పూర్వవాఙ్మయపద్ధతులపై ద్వేషపూరితమగు దృక్పథ మేర్పడును. కాని యది కాలక్రమమున నశించి నిర్మలత్వమును జెందును.

పరిషదుద్దేశ మాధునికకవులు తమగ్రంథములను బ్రాచీనప్రబంధకవులరీతిని రచింపవలయునని కాదు. పెద్దనాదిమహాకవుల యనంతరము పెక్కుకారణములవలన మన వాఙ్మయమునందును గవిత్వము

నైతికమార్గములకు దూరమై విపరీతమగు వర్ణనలతోడను, కథాసంవిధానములతోడను గూడి గతానుగతికమై క్షీణదశను గాంచినది. పాశ్చాత్యభావసంఘర్షణమునను, రాజకీయాదిరంగములఁ గలుగుమార్పుల వలనను దేశభాషావాఙ్మయము నేఁడు భిన్నమార్గముల నవలంబించు చున్నది. గీతములు (lyrics) నవలలు, చిన్నికథలు, ఖండకావ్యములు నభివృద్ధిని గాంచినవి. దీర్ఘములగు మహాకావ్యములపై నాదరము తగ్గినది. నాటకములు నేకాంకికములైనవి. ప్రహసనములు మొదలగు చిన్న రచనలు జనాదరణమునకుఁ బాత్రములగుచున్నవి. కేవలము వాఙ్మయ రూపములందుననేగాక భావములందును మార్పుకలిగినది. భిన్ననైతిక మార్గమునఁ జరించు పాశ్చాత్యపద్ధతులు మనయువకుల కాదర్శప్రాయము లయినవి. ఇందులకు మన విద్యాలయములయం దన్యభాషలకుఁ గల ప్రాముఖ్యము, ఫ్రాన్సు, రషియా, ఇంగ్లండుదేశములందలి యిరువదియవశతాబ్దపు వాఙ్మయ సంపర్కమును ముఖ్యకారణములు. నూతనమగు మార్గములఁ ద్రొక్కుటయే ప్రధానముగ నెంచి కొందఱుకవులు దుర్గమారణ్యభూములఁ దెరువెఱుంగక నిటునటుఁ బరుగు లిడుచున్నారు. వారి రచనలలోఁ జాలభాగ మనుకరణాత్మకమై (Literary Plagiarisms) అనఁదగియున్నది. మూలగ్రంథములనుగవులను బేర్కొనక తమ స్వతంత్రరచనలని పాఠకులు భ్రమించురీతిని గొలఁదిమార్పులతో రచించిన గ్రంథము లెన్నియేనిఁ గలవు. మనదేశము, భాష, సంప్రదాయములు, మతము, ఆదర్శములు, మొదలగువాని కనుగుణముగ వాఙ్మయము పెంపొంద వలసి యున్నది. అన్యదేశీయకవుల రచనలను బూర్తిగఁ ననుకరించుట మన భాషలకుఁగాని దేశమునకుఁగాని యభ్యుదయకరము గాదు.

ఇఁక భాషావిషయమునఁ గొందఱు కవులు ద్రొక్కుచున్న మార్గములును దుర్గమములై యున్నవి. మాతృభాషయగు సంస్కృతభాషపైనను, ప్రబంధకవుల మార్గముపైనను ననాదరణము కలుగుటచే నిట్టిమార్పులు

ఘటిల్లుచున్నవి. పూర్వకవులధోరణియు శాస్త్రములును వలదనువారగుటచే వీరిరచనలు నిరంకుశములై దారియుఁ దెన్నును లేక యున్నవి. శైలిమాటయటుండనిండు. వీరుపయోగించెడి భాష వ్యక్తులనుబట్టి మార్పునొందుచు వివిధమార్గములఁ బోవుచున్నది. అట్టిభాషయందుఁ గావ్యముల రచించి తాము వ్యావహారికభాష నుపయోగించితి మని వీరు సంతసించుచున్నారు. భాష కాలానుగుణముగ మార్పునొందదని పరిషదుద్దేశము గాదు. కాని ప్రతియుగమునను దత్తదనుగుణములగు మార్పులను బొందినను, ఒకయుగమున నొకరీతిగ నడచుటయే భాషాలక్షణము. మే ముపయోగించునది వ్యావహారికభాష; 'అందులకు నియమము లావశ్యకములు గావ'నువాదమును సహృదయు లంగీకరింపఁజాలరు. ఇటీవల నీ వ్యావహారికరచనకుఁగూడ ముందంజవేయుచు నొక నూతనకవిత్వము బయలుదేఱినది. అది (Surrealism) అని కొందఱు వచించియున్నారు. అందు పాశ్చాత్యవిద్యాప్రవీణులగు విద్యాధికులు సంభాషణమొనర్చు రీతిని, ఆంధ్రద్రవిడ తురుష్కాదిపదముల నిష్టమువచ్చినరీతి నుపయోగించి పద్యపాదములను బూర్తిచేయుచున్నారు. ఇందు గల ప్రయోజనము, వైలక్షణ్యము, వారికే యెఱుక. భాషలభివృద్ధిఁగాంచుటలో నన్యభాషాపదముల నవసరమైన తావులఁ గైకొనుట భాషాలక్షణములలో నొకటియే. కాని యట్టి పదములు చాలఁ దక్కువగ నుండును.

ఈనవీనకవులు తెచ్చిపెట్టిన మార్పట్టిదికాదు. తమభాషపై నుండు ననాదరణమువలననో, విద్యాలయముల నేఁటి విద్యావిధానమునఁ గలిగిన సాంకర్యమువలననో, స్వచ్ఛముగఁ దమభాషల నుపయోగింపఁ జాలక యిట్టి పద్ధతులకు దిగుట కడుంగడు శోచనీయము. ఇట్టి రచనలు భాషాసాంకర్యముచే వినుటకును జదువుటకును గఠోరములై యున్నవి. ఈ వినూత్నపద్ధతులను వదలి కవులు భాషాభ్యుదయమునకై పాటుపడి ధన్యులగుదురు గాక. కవిత్వవిషయమునఁ బూర్వకవియైన సూరనార్యుని

పలుకుల నాధునిక కవివతంసు లీయుగమునఁగూడ నాదర్శప్రాయముగఁ గై కొనఁదగునని మాయాశయము.

సీ. శబ్దసంస్కారమెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁబొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతనుఁ బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁబోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమ క్రియఁగడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు
నుపపత్తియొందు నత్యూర్జితముగ
తే. నొకటఁ బూర్వోత్తర విరోధమొందకుండ
దత్తదవయవ వాక్యతాత్పర్యభేద
ములు మహాకావ్య తాత్పర్యమునకు నొనరఁ
బలుకనేర్చుట బహుతపఃఫలముగాదె.

నేఁటి విమర్శక ప్రపంచమును గూర్చియుఁ గొన్ని విషయములు తెలుపవలసియున్నది. కేవలము వ్యక్తిగతదూషణములతోడను, దోషైక దృష్టితోడను, విమర్శకులు కొందఱు వ్యాసముల రచించుచున్నారు. అందలి దూషణభూషణ వాక్యములకు వీరి యాగ్రహానుగ్రహములే కారణమగుచున్నవి. కొందఱు పరస్పరస్తుతిసంఘములుగ నేర్పడి (Mutual admiration societies) మిగిలినవారిని దమతీవ్ర విమర్శనానలమున దహించుచున్నారు. మఱికొంద ఱల్పవిషయములఁ జర్చించి తమయమూల్యమగు పాండిత్యమును వ్యర్థమొనర్చుచున్నారు. అహమహమికతో రచింపఁబడు నిట్టి విమర్శవాఙ్మయ మంతరించి సద్విమర్శలు రచింపఁబడవలసియున్నవి. సంకుచితములగు భావములతో రచింపఁబడు విమర్శనవ్యాసములవలనఁ జాల ననర్థము వాటిల్లును. విమర్శకులు సహృదయులై గుణదోషవిమర్శనకుఁ గడఁగినచో నది వాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడఁగలదు.

# బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికా విమర్శనము.

దర్భా సర్వేశ్వరశాస్త్రి.

సూ. కర్మాదులకుం బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడం బోలె వానితోడ సమసించును. బాల. సమాస. 26.

ఈ సూత్ర మసమర్థసమాసానుగ్రాహకము. ఉదా:—రాముఁడు రావణుని సంహరించిన చాపము, రాముఁడు నివసించినవనము, మొ. ఇట 'సంహరించిన' అనునది భూతకాల క్రియావాచి ధాతువిహిత కర్త్రర్థ నవర్ణకాంతము గాన కర్తయగు రామునితో నభేదసంబంధముతో నన్వయించుటంబట్టి రాముఁడు అనుదానితో సమసించి, చాపముచే రావణుని సంహరించిన రాముఁడు అనుట న్యాయము. ఇట్లుండఁగా నసమర్థమగు చాపముతో సమసించుటచేత నిది యసమర్థసమాసము. దీనికి సాధుత్వ మీసూత్రము బోధించుచున్నది. నివసించిన వనము అందు అను ప్రక్రియావాక్యమున సమాససంజ్ఞ వచ్చి అందువిభక్తిలోపము రాఁగా నివసించినవనము అయి ప్రత్యయార్థఃప్రధానం ప్రకృత్యర్థో ప్రధాన మ్మని యున్నను ఇట అందువిభక్త్యర్థమునకు విశేషణత్వమును అధికరణభూతవనమునకు విశేష్యత్వ (ప్రాధాన్య) మును వివక్షింపఁగా రామకర్తృకనివసనక్రియా (పరంపరా) ధికరణభూతవనము అని బోధము కలిగి పిమ్మట నివసించినవనశబ్దమునకు తదన్వయినిరూపితవిభక్తి వచ్చును. కర్తతోడంబోలె అని సాదృశ్యము కర్తృవాచకముతో ధాతుజవిశేషణంబులకు సామర్థ్యప్రసిద్ధి సూచింపఁబడియె. మఱియు నీసాదృశ్యమువలనఁ గర్తృవాచకముతో సామర్థ్యమున్నపుడే కారకాంతర వాచకములతో నీయసమర్థసమాసమునకు సాధుత్వము సూచింపఁబడినది. (రామునిచే రావణుఁడు చంపఁబడిన చాపము; మృత్యువుచేఁ దలవట్టి యీడ్వఁబడిన వాఁడు వోలె మొదలగువాని సాధుత్వాసాధుత్వములనుగూర్చి మిక్కిలి విమర్శింపఁదగియున్నను గ్రంథవిస్తరభీతిచేఁ బ్రస్తుతము విరమించితిని.)

ఇట గుప్తార్థప్రకాశికామతము విమర్శింపఁదగియున్నది. అందు "కర్త ముఖ్యముగా నెఱవేర్చునట్టి వ్యాపారంబు కర్మాది కారకంబులపై నారోపింపఁబడినచో ధాతుజవిశేషణంబులు కర్తకుంబలె కర్మాది కారకంబులకును విశేషణం బగునని యర్థము. ఉదా:—రాముఁడు రక్షించిన భృత్యుఁడు. ఇట ధాత్వర్థంబైన రక్షించుట రామునిచే ముఖ్యముగా నెఱవేర్పందగ్గది. అయిన నట్టి రామనిష్ఠమైన రక్షణ భృత్యునిపై నారోపింపఁబడినది. కావున భృత్యుని రక్షించిన రాముఁడు అన్న వాక్యంబున రక్షించిన అనునది రామునకుంబలె రాముఁడు రక్షించిన భృత్యుఁడు అను ప్రకృతవాక్యములోఁ గూడ రక్షించిన అనునది భృత్యునకు విశేషణంబయ్యెను. ఈ వాక్యంబున రాముఁడు కర్తయును, భృత్యుఁడు కర్మంబును గావున ఇయ్యది కర్తృవ్యాపారంబు (కర్మంబు) పై నారోపించినందుల కుదాహరణము... ...సంస్కృత వ్యాకరణమునందుఁగూడఁ గర్తృవ్యాపారంబు కర్మాదికారకంబుపై నారోపించుట గలదు. కాని తెనుఁగుభాష రాముఁడు రక్షించిన భృత్యుఁ డిత్యాది వాక్యంబులలో రక్షించిన అనుదానికి రాముఁడు భృత్యుఁడును గర్తలైనట్టులు సంస్కృత భాషయందు నేకక్రియలోఁ గర్తకును గర్మాది కారకంబునకును నన్వయము లేదు. మఱియును సంస్కృతభాషలోఁ గర్తృవ్యాపారంబు కర్మాది కారకంబులపై సంక్రమింపఁజేసినప్పుడు కర్మాదికారకంబులకు సౌకర్యాధిక్యము భాసిల్లునట్లు స్ఫురించుచుండును. తెలుఁగునందుఁ గర్తృక్రియారోపణమువలన నట్టి ధర్మంబు స్ఫురించుటలేదు... ...ఇట్లు భాషాద్వయంబునఁ గొన్ని భేదములు గలవు" అని కలదు.

సూత్రంబున సమసించును అని సమాసవిధానము స్పష్టమగుచుండఁగాఁ గర్మాది కారకంబులకును విశేషణమగునని యర్థము అని అసంగతమగు విశేషణత్వమునకు విధాయకముగ సూత్రమునకు వ్యాఖ్యానము చేయుట చింత్యము.

రాముఁడు రక్షించిన భృత్యుఁడు అనుచోట రామనిష్ఠ కర్తృత్వమును భృత్యునియం దారోపింపఁగా రామునియందుఁ గర్తృత్వము లేదుగాన రాముఁడుగూడఁ గర్తగా నన్వయించుననుట చింత్యము.

ఆరోపమనఁగా ఆహార్యభ్రాంతి. ఆహార్యమనఁగా బాధకాలికేచ్ఛాజన్యము. నిష్ఫలముగ భ్రాంతిజనకేచ్ఛ కలుగుననుట సాహసము. తుదకు లాఘవాదులైనను ఫల ముండవలయును. అట్టిదేదియు నిట లేదు. కాన నీయారోపము నిష్ఫలముగఁ జేయఁబడుచున్న దనుటకూడఁ జింత్యమే. కర్తతోడంబోలె అని సాదృశ్యప్రదర్శనముగూడ వ్యర్థమే.

శ్రీ దూసి రామమూర్తిశాస్త్రులుగారును కేవలము గుప్తార్థప్రకాశిక ననుసరించుటచే వీరి మతము విమృష్టకల్పమే. ఒక విషయమును విమర్శించెదను. "ప్రాధాన్యవివక్షంజేసి కర్తవంటి ప్రాధాన్యము సిద్ధించెడిఁగానఁ గర్మాదులు ప్రథమాంత ములగుట చూపఁబెట్టెడి. ప్రథమసుమూలమునసే ప్రాధాన్యవివక్షయుఁ గర్తవంటి దగుటయును స్పష్టపడియెడిఁ గానఁ బ్రథమ యగుట నిర్బాధము. కర్తృవ్యాపారము కర్మాదులం దారోపించుటయే కర్మాదులకైన ప్రాధాన్యవివక్షయని గ్రహింపవలయును." అని పేటికలోఁ గలదు. ఇది చింత్యము. రాముఁడు రక్షించిన భృత్యుఁడు అనుచోట భృత్యశబ్దమునకుఁ బ్రథమ కర్తవంటి ప్రాధాన్యమును వివక్షించుటవలన రాలేదు. అస్తిర్భవంతిపరః అను న్యాయమున అధ్యాహృతమైన అగు ధాతువునకుఁ గర్త గాన వచ్చినది. ఇట్లు కానిచో రాముఁడు రక్షించిన భృత్యుని నేనుఁ జూచితిని. అనుచోట దూసివారి వ్యాఖ్యానముంబట్టి భృత్యశబ్దమునకుఁ గేవల ప్రథమగాని ప్రథమాద్వితీయలు పర్యాయంబునఁ గాని రావలసియుండునని యెఱుఁగునది. ఈరెండు టీకలయందును ఇంకను గొన్ని దోషములుగలవు. వానిని పండితు లూహింతురుగాత. దీనికి మూలమగు కర్మాదేః కర్తృత్వం ప్రథమాచనవర్ణకశ్చ తద్వత్స్యాత్తను శ్లోకమునకు విమర్శనమును గ్రంథవిస్తరభీతిచే విరమించితిని.

సర్వంశమ్.

# ఆదికవి.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

---

శ్లో. శ్రీమద్భారతభారతీవ్యతికరక్షేమంకరస్వాత్మనే
వాక్సృష్టి ప్రథమావతారపదవీ సింహాసనాధ్యాసినే
స్వాధ్యాయాధ్యయనాభిగమ్యసుమహస్సన్మార్గ సంచారిణే
బధ్నీమోఽఞ్జలి మచ్యుతప్రణయినే శ్రీనన్నయబ్రహ్మణే.

క. నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయ సార్వభౌముని గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠగాథప్రతిభున్. ౧

శా. నీవైదగ్ధ్యము కుండలీంద్రునకె వర్ణింపంగఁ గాదయ్యెఁ, దం
డ్రీ! వాణీజననీస్తనంధయుఁడఁ గీర్తింపంగ నేనెంత? సు
శ్రీ వాలించిన యాదిసత్కవి శిరశ్చింతామణీ, న్నిన్ను, నీ
ప్రావీణిం బ్రతిసంధ్య మాత్మ భజియింపం శాప మిట్టింకదే? ౨

శా. ధన్యం బయ్యెఁ దెలుంగుభారతి, కృతార్థంబయ్యె నస్మద్వచో
విన్యాసంబు, పవిత్రమయ్యెఁ గవితావీథీవిటంకంబు, స
మ్మాన్యం బయ్యె సమస్తభూమి, రససంపల్లంపటోదారవా
ణీన్యంచద్భవదీయభారతకథానిర్మాణ మర్మజ్ఞతన్. 3

శా. చాళుక్యాధిపవిష్ణువర్ధనయశస్సౌరభ్యసంపత్తి ది
క్పాళి న్నించిన నిర్మలాద్భుతతరస్వస్సింధువార్వీచికా
కేళీకల్ప భవన్మనోహరకృతిక్రీడావిలాసమ్ములన్
హాళిం దేలెఁ దెలుంగుదేశము మహాత్మా! నన్నయాబ్జాసనా! ౪

సీ. ఒకచక్కి గాంగు లామోదనాభిరతి మి
న్నులుముట్టఁ జెలఁగి గంతులను వైవ

చోడభూపతు లొక్కచోఁ గత్తి జళిపించి
రణ మొనర్పఁగఁ గాలుద్రవ్వుచుండ
నొక్కవంకఁ గళింగయోధు లాహవభేరి
మ్రోయించి దిక్తటముల నదల్పఁ
జలము మీఱఁగఁ గదంబులు డంబుసూపి యొ
క్కొకవేళ నుద్ధృతి హుంకరింపఁ
దెలుఁగురాష్ట్రము వేఁడిమంగలము వగిది
నుడుకుచుండిననాళ్ల మహోదయుండు
విష్ణువర్ధననృపుని దీవించి రాజ
రాజ నొనరించితివి కవిరాజరాజ. ౫

ఉ. అక్రమలీల భారతమహాబ్ధికి నేతము నెత్తి విజ్ఞలో
కశ్రవణానురంజనముగా రచియించితి మూఁడుపర్వముల్
విశ్రుతికెక్క, నీదగుపవిత్రకవిత్వమహత్త్వముం సదా
నుశ్రవికప్రపత్తియు జనుల్ గొనియాడఁగ శబ్దశాసనా ! ౬

చ. అవిరళహోమతత్పరుఁడవై శ్రుతిసారము నభ్యసించి ధ
ర్మవిధులలోన గణ్యత నిరంతరముం గడియించి నిత్యస
త్యవిమలసద్గుణప్రతతి నార్యసభ ల్గొనియాడునట్లుగాఁ
గవివృషభా ! మెలంగితివిగాదె ? జగద్ధితబుద్ధిశోభివై. ౭

ఉ. గాసటబీసటేచదివి గాథలు త్రవ్వ తెలుంగువారి కా
యాసము నాక 'వ్యాకరణ'మన్నది కల్పనసేసి యిచ్చి యీ
బాసకుఁ బెట్టినాఁడవు శుభంబగు గ్రాంథికభిక్ష నక్షయ
వ్యాసముగాఁగ నన్నయమహర్షి ! నమస్సులివేగయికొమ్ము ప్రేముడిన్.

క. ఒక్కఁడు నియోగి యని వే
ఱొక్కఁడు వైదికుఁడవనియు నూహించిరి యే
చక్కిఁగలవాఁడవైనను
మ్రొక్కందగువాఁడవే ప్రపూతచరిత్రా ! ౯

ఉ. వైదికధర్మనిష్ఠమగు వర్తనముంగొని యాయజూక బ
ద్ధాదరగౌరవమ్ములఁ గృతాధ్వరతంత్రుఁడవై, సమస్తలో
కాదరణీయభారతము నంధ్రమున న్వెలయించి, నీవ నీ
వైదికవంశసంభవత వారక చాటితి వేరుపాటుగన్. ౧౦

ఉ. ఒవ్వనివార లెవ్వరొ మహోత్తమమైన భవత్కవిత్వమున్
నొవ్వగనాడి "తిక్కన ఘనుండు కళావిదుఁ"డంచు మీసముల్
దువ్వినఁగాక దానికి బుధుండ వసూయ వహింతె? తెల్గులో
నెవ్వరికంటెను న్మొదట నెన్నద మాదికవీశ్వరా! నినున్. ౧౧

గీ. దర్భలును హోమధూమసంతతులు మంత్ర
తంత్రమాహాత్మ్యములు సత్యధర్మవిధులు
బ్రాహ్మణత్వముఁదక్క నీభారతమునఁ
గావ్యకళ శూన్యమఁట వింటె? కవివరేణ్య! ౧౨

ఉ. రిత్తకురిత్త వాదములు రేఁగెను "తిక్కనముందు భట్టు పే
రెత్తఁగ వీలులే"దని యదేమన నీయెడ వైదికత్వసం
పత్తియు దక్క గావ్యకళ ఫక్కి హుళిక్కియటందు, రీమనో
వృత్తుల కాత్మ నవ్వుకొనెదే మహితాత్మక! నన్నభట్టరా! ౧౩

క. భావితమతి తిక్కన యతి
పావననిజబుద్ధి నిన్ను భావించి రస
శ్రీవిభవమ్ముగ భారత
భావుకరచనాభిపూర్తిఁ బరఁగించెఁగదా? ౧౪

ఉ. వాగనుశాసనప్రథిమ వర్ణనకెక్కినవాఁడ వంధ్రభా
షాగరిమంబు డంబు సరసస్థితి శాశ్వతరీతి నీమహో
ద్యోగము కల్మి నిల్చె మహిమోదయ! బిట్టు నసూయమై పురో
భాగులు నీదు సత్కవనపద్ధతి మెచ్చకయున్న లోపమే? ౧౫

క. వైదికలౌకికశాఖా
భేదము లీనాఁడు పెచ్చుపెరిఁగిన కతనన్

వాదగ్రంథము కడు వి
ద్యాదయితా! నీతదర్థమై విలసిల్లెన్. ౧౬

క. కవిజీవితకారులు భువి
నవునది కాదనియుఁ గానిదవునని యెవియో
హావణించినంతమాత్రన
ప్రవిమలచరితలకు భంగపా టౌదవునో? ౧౭

చ. అలఘుచరిత్ర! తావకమహాద్భుతసద్వినుతావదాతగా
థలకుఁ గలంకు వుట్టెడుకథ ల్పరికల్పనసేసి వ్రాసి రీ
తెలుఁగున రెండుమూఁడిటిని దెల్పెదఁ దద్విధమెల్ల నీకు, మూ
కలుషితశేముషీకులప్రకల్పనము ల్వని నవ్వకున్నచోన్. ౧౮

ఉ. వేములవాడ భీమకవివీరుఁడు త్వన్ముఖదర్శనార్థియై
రా, మది నీర్ష్యపెల్లు దనరం దమదారకృతిద్వయంబు వ
హ్న్యర్పిపముం బొనర్చితఁట, నంతట నాతఁడు నీదు "శబ్దచిం
తామణి" గాతమీరుఖరములం గలిపె న్వెస నంద్రదు పండితుల్. ౧౯

క. మతిసెడి తచ్ఛాపంబున
వెతగుడిచి గతించి తనుచు విపరీతగతిం
గతచెప్పుకొండ్రు రిది సం
గతమౌనే? రాజరాజకరుణాపాత్రా! ౨౦

సీ. ఆథర్వణోపజ్ఞమగు భారతగ్రంథ
సందర్భమును విని సైఁపలేక
దుష్కార్యకృతికినై తొడరి తత్కృతి నగ్ని
సాత్కృతి నొనరింపఁ జూఁగ, నట్టి
ఘోరపాతకమునఁ గూరు నున్మాదంబు
కతమున వెతగుందఁగంటి వనుచు
నర్థమ్ములేని లోకాపవాద మొకండు
దనరె నద్దానఁ జిత్తమ్ములోన

నడలఁబోకు మథర్వణుండనెడి యాతఁ
డాదికవివర్య ! నీకంటె నాధునికుఁడు
తత్త్వసంగ్రహానైకతాత్పర్యధుర్య
మతులు తెల్పిరి దీని నిమ్మాడ్కిఁగాఁగ. ౨౧

క. నడిసన్న పండితుఁడవై
గడియించితి రాజరాజకారుణ్యం బే
ర్పడ యోచించినచో నిను
గడ నీకుం బాడమెననుట కల్లయగాదే ? ౨౨

గీ. *నన్నెచోడమహారాజు కన్న నీవు
వెనుకవాఁడ వటంచు దోర్వీర్యవంతు
లైన పరిశోధకులు లాగఁ బూనినపుడు
మనవి సేయఁగ నేటికి మాయవస్థ. ౨౩

క. వాగనుశాసనబిరుదం
బేగతి లభియించె నాఁటి యుము కవితా
ప్రాగల్భ్యముకతమున నీ
కా గౌరవబిరుద మబ్బెనని యొక్కఁడనెన్. ౨౪

గీ. "అన్యకృతము చింతామణి" యని ప్రసిద్ధ
పండితులు కొంద తేదియో వ్రాసి; రైన
నా వివాదము నిస్సారమై యపాస్త
సత్యమై భూమి నిలువక సమసిపోయె. ౨౫

క. ఆరణ్యపర్వశేషము
నీ రచనయకా రచించె నిశ్చలభక్తిన్
ధీరుం డెఱ్ఱాప్రెగ్గడ
చారుతరాత్మీయకవనచాతురి మెఱయన్. ౨౬

* శ్రీమానవల్లి రామకృష్ణకవిగారి నన్నిచోడ కుమారసంభవము పీఠిక నరయుఁడు !

ఆ. తిక్కశర్మ దానిఁ దెలిఁగింపకునికి కా
రణము భీతి యనుచు గొణుగుకొందు
రాజఘనుఁడు సోమయాజి కిట్టి భయంబు
కలదనుట యథార్థకథన మగునె ? ౨౮

ఉ. పాయక నీరచించుకొను భారతసంహితలోన వేడ్క నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుతోఁడు స్మరించినాఁడ వా
ప్యాయముతోడ నాతని సహాయము దేనఁ బరిగ్రహించి తా
తోయము సర్వముం గవనధూర్వహ ! తెల్పు దయార్ద్రబుద్ధివై.

క. దధలకుఁ బ్రాసముగూర్చుట†
బుధవర ! నీకభిమతంబె పో ! యిచటి మహా
రథికులు నతిరథికులు నగు
సుధీవరుల మతము లరయఁ జోద్యంబయ్యెన్. ౨౯

శా. *'ముష్టాముష్టి' నపాణినీయపుఁ బదంబుం బాండితీప్రౌఢిమా
వష్టంభంబున దుర్నివార్యగతి యొప్పం గూర్చినావంచు నే
కష్టాత్ముండో వచించుఁగాక ! యదిలోకస్తుత్యజాతీయ వా
క్సృష్టిస్రష్టకు నీకు లోపమగునోయీ ! నన్నయాబ్జాసనా ! 30

---

† కాదన కిట్టి పాటియపకారము తథకుఁ దేకవిప్రసంబోధనఁ జేసి చేసి నృపపుంగవ....ఇది 'చోదన' యని దిద్దిరి. క. ముద మొదవ....సుధేష్ణ తజ్జాలకమున.... విరాటపర్వము. క. వింధ్యాద్రివోలె నాప్రతి, వింధ్యుఁడు...ద్రోణపర్వము. మొదలగు ప్రయోగము లప్పకవి యొసఁగినాఁడు. ఆధునికులకు దధప్రాసనిషేధాభినివేశ మెందులకో ?

*క. భీమాసురవీరుల ముష్టాముష్టిరణ ఛటాచ్ఛటాశబ్దం, బుద్దామంబై.... భారతము. అర. ౩. ౩౯౭. ప. ఇది యపాణినీయము, నిరంకుశము నని కొందఱు విమర్శించిరి. అపాణినీయము కావచ్చునుగాని నిరంకుశప్రయోగము గాదనియు ముగ్ధబోధాదివ్యాకరణములవలన సాధితమనియు దానిపై విమర్శనములు వెలువడినవి. శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలు గారలు (18-12-37 సం.)

సీ. నిర్ధారకముగ నీ వర్థి 'ధారుణి' ‡యని
యున్మధ్యముగఁ గూర్చియుంటి వొకట
కఱకంఠశబ్ద మే కరణి సాధ్యము చేయ
భావించి యుపయోగపఱిచినావు
'కవిలగడ్డంబుల' గఱిని వ్యాకర్తలు
పలు దెఱంగులుగాఁ దెలిపినారు
'తఱుసంటి' శబ్దరత్నాకరకారుండు
తఱుసలి యనె దీనితత్త్వ మేమి?
పండితాధ్యక్ష! యిట్టిసంప్రశ్నములకు
విసుపుకొనకుండఁ గరుణ యావిష్కరించి

---

ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో నీప్రయోగమునుగూర్చి చర్చించిరి. శ్రీకిళాంబి రాఘవాచార్యులుగారు ఎమ్. ఏ., బి.ఎల్., ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (౨౯సం. సంచిక ౫.)లో ముష్టాముష్టిప్రయోగవిచార మొనర్చిరి. ఆ వ్యాసములు చూచిన నీ ప్రయోగవిషయము తేటతెల్లమగును. "బాహాబాహిప్రయోగమును ముష్టాముష్టివంటిదే. పూర్వపదమున నాత్వమును విధింపనిచో నిది బాహూబాహవి యనవలసివచ్చును." అని పైవారి వ్యాసమునఁ గలదు. బాహాబాహి, ముష్టాముష్టివంటిది కాదు. ఉకారాంత బాహుశబ్దమే గాక, ఆకారాంత బాహాశబ్దముకూడ స్త్రీలింగములోఁ గలదు. బాహాశక్తి బాహాగర్వము మున్నగు ప్రయోగములు ప్రహతముగానున్నవి. కనుక ముష్టాముష్టికి, బాహాబాహికి సామ్యము లేదు. అయినను విమర్శకులు వ్రాసినట్లు బోపదేవుఁడు, ఉభయచంద్రసూరి మొదలగువారు 'ముష్టాముష్టి'ని సాధించుటచే నిది నిరంకుశము గాదని యెఱుంగునది.

‡చ. గుణములనొప్పి బ్రాహ్మణులకుం గడు భక్తుఁడవై సమస్తధారుణి ప్రజ గూర్పఁగా విగతరోషుఁడవై సుఖముండు మింక...భార. ఆది. ౯. ౧౭౮.

ఉన్మధ్యముగానున్న ధారుణి కిది నిర్ధారకప్రయోగము. ఇట్టిదే నన్నెచోడ కుమారసంభవము. ౧౧. ౪౦౫ లో మఱియొకటి కలదు. వ్యాకరణముచే ధారిణి, అనిగాని ధారణి అనిగాని సిద్ధించును. ధరణశబ్దము మేదినీకోశములో జలార్థక మైనది యున్నదిగాని దానిచే ధారుణీరూపముగూడ నిష్పన్నమగునని శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటుకారుల యభిప్రాయము.

సముచితంబుగఁ బ్రత్యుత్తరములు చెప్పఁ
గదవె? శబ్దానుశాసనాఖ్యాకమాన్య!

క. నీతల్లిదండ్రు లెవ్వరొ
చేతమున కెఱుంగరాక చింతింతురు భా
షాతంత్రవిదులు, వారల
కైతియె యాదికవి పుట్టు నభివర్ణింపన్.

ఉ. భారత మంధ్రభాషఁ బ్రతిపర్వరసోదయమేదురంబుగాఁ
గూరుచు పొంటెఁ దెల్గుఁగవులుకుల్ సరిదిద్దిన నీకృతిక్రియా
ధోరణి కిచ్చమెచ్చని బుధుండు గలండె మహాత్మ! మన్నమ
స్కారము స్వీకరించి యొడికంబగు కైత ననుగ్రహింపుమా.

---

# సుబ్రహ్మణ్యభారతి.

కౌమాండూరి శఠకోపాచార్యులు ఎం. ఏ., బి. యల్.,

సుబ్రహ్మణ్యభారతి యీశతాబ్దిలోని తమిళభాషాకవులందఱిలో ముఖ్యుఁడు, విశేషప్రతిభాయుతుఁడు. హిందీ, బంగాళీ, మరాఠీ, గుజరాతీ, ఓఢ్రములు ప్రాకృతభాషకుఁ బరిణామములు. క్రీ. శ. 10 వ శతాబ్దివఱకుఁ బ్రాకృతభాషయే ప్రాంతీయభేదములతో నార్యావర్తమంతటిలో వ్యాపించియుండెను. అందును సంస్కృతమునను మాత్రమే గ్రంథములు వ్రాయఁబడుచుండెను. అప్పు డాంధ్రదేశమందును జాలవఱకట్లే జరిగిన ట్లూహింపఁబడుచున్నది. ఈప్రాంతములన్నిటిలో నేఁటి వాడుక భాషలలో నిప్పుడున్న వాఙ్మయము 10 వ శతాబ్దికిఁ దరువాతనే యేర్పడినది. దక్షిణప్రాంతమందు వాడు తమిళములోని వాఙ్మయము రెండు వేలయేండ్లక్రిందటనే ప్రారంభించినది. అప్పటి పాండ్యచేరరాజుల యాస్థానపు 'సంఘు'కవులు రచించిన 'శిలప్పదికారం, మణిమేఖలై' మున్నగు ప్రబంధకావ్యములు, తిరువళ్ళూరు రచితమగు 'తిరుక్కురల్' వంటి నీతిబోధకరచనలును జాలఁబ్రాచీనమగు స్వతంత్రగ్రంథములు. అంతట మతబోధకై భక్తిప్రతిపాదకములు, పుణ్యక్షేత్రవర్ణనాత్మకములునగు ధార్మికగ్రంథములు నెన్నియో వెలువడినవి. ఇవి నేఁటికిని బవిత్రగ్రంథములుగ భావింపఁబడుచు నాదరింపఁబడుచున్నవి. ఇవియు క్రీ. శ. 10 వ శతాబ్దికిఁ బూర్వపువే. ఈప్రాచీనసాహిత్య మంతటిలో దైవభక్తికి శాంతరసమునకుఁ బ్రాధాన్య మీయఁబడినది. తరువాత నాంధ్రవాఙ్మయము నేఁటి యార్యభాషల వాఙ్మయమును నిర్మితమగుచుండినప్పుడు, తమిళములోను భారతరామాయణాదులు పురాణములు ననువదింపఁబడినవి; కొన్ని ప్రబంధకావ్యములు నేర్పడినవి. కాని తమిళమున కాప్రత్యేకవ్యక్తితయుఁ బ్రాచీనసంప్రదాయమును జాలవఱకునిల్చియున్నవి. శబ్దములలో

నచ్చు తమిళపదముల వాడుక చాలహెచ్చు. దేశ్యతద్భవములనే వాడవలెనని వాదించుటయు కలదు. ఇటీవల నాంగ్లవాఙ్మయసంపర్కముతోఁ గొంత నవ్యదృష్టి యేర్పడినది.

ఈశతాబ్దిలో నిద్దఱు విద్వాంసులు తమరచనలచేతఁ దమిళ వాఙ్మయమునందు గొప్పపరిణామముఁ గల్గించినారు. వీరిలోఁబెద్దవాఁడగు శ్రీ. యు. వి. స్వామినాధయ్యరు పూర్వపుఁ దమిళగ్రంథములను శిథిలమగు తాళపత్త్రములనుండి పునరుద్ధరించి శ్రద్ధతోఁ బరిశోధించి, ఆధునిక విమర్శపద్ధతిని బీఠికలను వ్యాఖ్యానమును వ్రాసి ముద్రింపఁ జేసినారు; మధ్యకాలపుఁ దమిళకావ్యములఁ గూర్చియుఁ జక్కని విమర్శలఁ జేసినారు; కొందఱు మహాకవుల జీవితచరిత్రలఁగూడ వ్రాసి, (87 సం॥ల వయస్సున) ఈసంవత్సరము ఏప్రిలు నెలలో మరణించినారు; రెండవ వాఁడు సుబ్రహ్మణ్యభారతియే.

ఈసుబ్రహ్మణ్యము తమిళనాడు నైఋతిప్రాంతపు తిరునల్వేలి జిల్లాలోని జమీందారీ గ్రామమగు 'ఎట్టెయాపురము'లో 1882 సం॥ర నవంబరు నెలలో జనించెను. ఈయనతల్లి రూపవతి, సుగుణరాశి; ఆమె యీతనియయిదవయేటనే కాలధర్మమొందెను. తండ్రియగు చిన్నస్వామి అయ్యరు మాతృబాధ్యతఁగూడవహించి, ఆబాలు నెట్లో పెంచెను. చిన్నస్వామయ్యరు ఎట్టెయాపురం జమీందారీలో నుద్యోగిగ నుండెను. ఆయన ధీమంతుఁడు, చతురుఁడు నగు వ్యవహర్త. ఆయన తన ప్రాంతీయులకు మార్గదర్శకముగ మొదటి దూదిమిల్లును స్థాపించి నడిపెను. అప్పటి యెట్టెయాపురం జమీందారు విద్వాంసుల నాదరించుచుండెను. చిన్నస్వామయ్యరు స్వయముగఁ దమిళమున విద్వాంసుఁడగుటయే గాక, అక్కడి విద్వాంసులతోఁ దనయింటఁ దఱచు పండితగోష్ఠి సాగించుచుండెను. సుబ్రహ్మణ్య మట్టివిద్యాగోష్ఠి మధ్యను బెరిగెను. అక్కడి స్కూలులోనిఁ చదువు సుబ్రహ్మణ్యమున కుపయోగింపలేదు. ఈనాఁటి ప్రభుత్వముచే నియమితమగు పాఠశాలలపద్ధతిలోని లోపము లందఱికిని

తెలిసినవియే. సుబ్రహ్మణ్యము శైశవమునందే తండ్రియొద్ద కురల్, కంబరామాయణం ఇత్యాదులఁ జదివి మాతృభాషయందుఁ దీవ్రాభిరుచిని జ్ఞానమును సంపాదించెను. కాని, కాళిదాసు గాథవలె, సుబ్రహ్మణ్యము చరిత్రమును, నభ్యాసశ్రమకన్న, నతఁడు వాగ్దేవి కరుణచేఁగల్గు సహజప్రతిభవల్లనే స్వతంత్రకృషితో మహాకవి యయినట్లు తెల్పుచున్నది. బాల్యమం దీతని కుండిన యద్భుతప్రజ్ఞను గూర్చి యనేకగాథలు కలవు. తండ్రియొద్దకువచ్చువిద్వాంసులు చేయుప్రసంగము లతడు శ్రద్ధతోవినుచు రవీంద్రునివలెఁ జిన్నతనమునుండియు గీతముల వ్రాయుచుండెను. ఏడేండ్ల వయస్సునుండి, అతఁడు తమిళమునఁ జక్కనిపద్యకావ్యముల వ్రాయఁ దొడఁగెనఁట. 8,9 సం॥ల వయస్సునుండి పండితగోష్ఠిలోను గవిసమావేశములలోను బాల్గొనుచు, ఆశుకవిత్వముఁ జెప్పుచుండెను. ఆంధ్రదేశములోవలెఁ దమిళప్రాంతములలోను పాదపూరణముద్వారా కవులఁ బరీక్షించుపద్ధతి యప్పుడు వ్యాపించియుండెను. ఈకవికిశోరమున కంత ఖ్యాతి వచ్చుట కోర్వని కొందఱు పెద్దపండితు లాతనిఁ బరాభవింపఁ దలఁచి, చాలఁగ్లిష్టమగు సమస్యల నంత్యపాదముగ నిచ్చి యతని నగ్నిపరీక్షఁ జేయుచుండిరఁట. సభలో నందఱిలోఁ జిన్నదైనను సుబ్రహ్మణ్య మేమియు జంకక, వెంటనే యద్భుతయుక్తితో మొదటి మూఁడుపాదములు నాశువుగఁ జెప్పి పూర్తిచేయుచు, పరీక్షకులనే చకితులుగఁజేసెను. ఈ బాలకవి కీర్తి తమిళజిల్లా లంతటను వెంటనే వ్యాపించెను.

ఆవయస్సున నట్టి యద్భుతప్రజ్ఞ యుండుట లోకోత్తరము. కనుక నాతనిఁగూర్చిన వదంతులు విశ్వసనీయము కావని సందేహించి, అఱవములో నప్పటి గొప్పవిద్వాంసులు కవులు నొక మహాసభఁజేసి, సుబ్రహ్మణ్యమునక్కడకు రప్పించి వివిధరీతుల నతని ప్రజ్ఞాపాండిత్యములఁ బరీక్షించిరఁట. అట్టి శతవిధపరీక్షలలో నతని సమయస్ఫూర్తికి భావోన్నతికిఁ గవిత్వధాటికి ఫలితముగ వారిసందేహములు వీడుటయేగాక, ఆనందముతోపాటు వారికతనిపైన గాఢగౌరవమును గల్గినది. మూర్తీభవించిన సర

స్వతిపబ్లోఁ దోఁచు నాతని కావిద్వత్సభవా రాసభలోనే 'భారతి' యను బిరుద మొసఁగిరి. అప్పటికాయనవయస్సు 11 వత్సరములు. అంతటినుండి యతని మొదటిపేరు మఱుఁగుపడి 'భారతి' యను పేరే యందటి వాడుక లోనున్నది. ఆయన తిరునల్వేలిలోని 'హిందూకళాశాలలో 3 మొదలు 5 వ ఫారమువఱకుఁ జదివెను. ఇంతలో బాల్యమందే యాయనకు వివాహముజరిగినది. మఱుసాలునఁ దనతండ్రి మరణించెను. అప్పటినుండి భారతి కార్థికకష్టముగల్గి సంసార బాధ్యత తనపైఁ బడినది. 1901 లోఁ దన మేనత్తతో డుగఁ గాశిక్షేత్రమున కేఁగి, ఆయన అలహాబాదు విశ్వవిద్యాలయ ప్రవేశపరీక్షలో మొదటి తరగతిలో నుత్తీర్ణుఁడై స్వస్థలముఁ జేరెను; తిరునల్వేలిలోని కళాశాలలో మరలఁ జదువఁబూనినను నార్థికబాధవలన నాయన జీవనోపాధికై శ్రమపడసాఁగెను. ఎట్టియాపురపు యువరాజునకు తమిళ బోధకుడుగఁ గొలఁదికాలము గడపెను. తన గీతముల రచనవలన ఖ్యాతిహెచ్చినను, ద్రవ్యలాభము లేకుండెను. అప్పటికింకను విద్యావంతులకు మాతృభాషాదర మేర్పడలేదు. తమరచనలద్వారానే కొంద అాంగ్లలేఖకులు లక్షాధికారులయినారు. కాని, ఇప్పటికి నీదేశములో సాహిత్యసేవతోనే జీవికయు నేర్పడుట యరుదు. అంతట 1904 లో సుబ్రహ్మణ్యభారతి స్వస్థలమునువీడి, మదురఁ జేరి, అక్కడి సేతుపతిహైస్కూలులో మూఁడునెలలు తమిళపండితుఁడుగనుండి, తరువాత మద్రాసుఁ జేరెను. కాని యక్కడ తగుజీతమువచ్చు నుద్యోగము దొఱకలేదు.

అప్పుడు చెన్నపురిలోఁ బ్రసిద్ధ దేశభక్తుఁడగు జి. సుబ్రహ్మణ్య అయ్యరు నడుపు 'స్వదేశమిత్రన్' అను తమిళ వార్తాపత్రికకు సహాయ సంపాదకుఁడై, భారతి తన రచనల నాపత్రికద్వారా బ్రచురింపఁదొడఁగెను. పిమ్మట కొందటి సలహాపైన దానిని విడిచి, 'బాలభారతం, ఇండి..' మున్నగు సామయిక పత్రికలను స్థాపించి సంపాదకుఁడై నడి..పువలనఁ గొంత ప్రసిద్ధియు, తనరచనల కాంత్రాంతమంతటను ..ను గల్గెను.

ఇంతటిలో, అప్పటి రాజకీయరంగము తీవ్రరూపముఁ దాల్చినది. 1905 లో 'వంగభంగము' ను, 1906 లో దాదాభాయి నౌరోజి యధ్యక్షతను కలకత్తా కాంగ్రెసును జరిగెను. పాలు మున్నగు జాతీయ వాదు లీప్రాంతమందు 1907 లో గట్టి ప్రచారము చేసిరి. విద్యావంతు లు కొందఱు జాతీయభావపూరితులైరి. దక్షిణమున స్వదేశీనౌకాపరి శ్రమ ఇత్యాదు లేర్పడినవి. అందువలన బ్రిటిషుసంఘముతో పోటీ వచ్చెను. స్వదేశ యుద్యమము బ్రిటిషు వస్తు బహిష్కారస్వరూపమెత్తి నది. ప్రభుత్వమువారు 1908 లో జాతీయవాదులపైనఁ దీవ్రనిరోధము సాఁగించిరి. తూత్తుకుడిలోని స్వదేశనౌకాసంఘపు నాయకుఁడగు శ్రీ చిదంబరం పిళ్ళె మున్నగువా రరెస్టు చేయఁబడి జెయిలులో నుంచఁ బడిరి. భారతి పత్రికా సంపాదకుఁడుగ పిళ్ళె మున్నగు జాతీయోద్యమ నాయకులను సమర్థించుచు దేశభక్తిని బ్రేరేపించుచు వ్యాసములను గీత ములను బ్రచురించెను. అపుడు కొందఱు పత్రికాసంపాదకులపైనను గూడ సర్కారువారు చర్యల జరిపిరి. అప్పటి ఆంధ్ర'స్వరాజ్య' సంపాద కుఁడగు హరిసర్వోత్తమరావుగారు శిక్షింపఁబడిరి. ఇట్లే 'కర్మవీర' అను నాంగ్లపత్రికలోఁ బ్రచురించిన రాజకీయవ్యాసమున కరవింద ఘోషుగారి పైన వారంటు జారీయయినది. అప్పుఁడరవిందుఁడు హఠాత్తుగ పుదుచ్చేరి (ఫ్రెంచిరాజ్యము) చేరి, ఆశ్రమ మేర్పఱుచుకొని యప్పటినుండి యందే ధార్మికపరిశ్రమ చేయుచున్నాఁడు. ఆసమయమందే, భారతివ్రాఁత లుద్రే కజనకములని యతనిపైన మద్రాసుప్రభుత్వము చర్యజరుపుయత్నములో నున్నట్లొక కబురువచ్చెను. అంతట భారతి మద్రాసు వదలి(1909డిసెం బరు) పుదుచ్చేరిచేరి, పదేండ్లకాల మక్కడనే యుండిపోయెను; పుదు చ్చేరినుండి యతఁడు పత్రికలకు వ్రాయుటేగాక, కొన్ని కావ్యగ్రంథ ములఁగూడ రచించెను. కాని, ఆతనికి యువకోత్సాహముపోయి, తాత్త్వి కధోరణి యాధ్యాత్మిక దృక్పథమును హెచ్చిన ట్లారచనలవలన స్పష్ట మగును.

మిత్రులలోఁ జాలమంది యప్పుడు భారతిని మఱచిరి; ఆయన కార్థికకష్టములు హెచ్చినవి. సరస్వతీప్రసాదమేగాని లక్ష్మీప్రసాదము పోయినది. ఆరోగ్యము చెడినది. స్నేహితులతో సంపర్కమును స్వేచ్ఛావిహారమును లేక, ఆధివ్యాధులవలన భారతి వికలుఁడాయెను. ఆయన మొదటినుండియు దేహపరిశ్రమవిషయమున శ్రద్ధ వహించలేదు. తుదకు వ్యాకులతతో భారతి 1918 సం॥రంలో బయటకువచ్చి, తిరునల్వేలి జిల్లాలో కొంతకాల ముండెను; తరువాత మిత్రులాయనను మద్రాసునకు రప్పింపఁగా, 1920 సం॥లో శ్రీరంగస్వామి అయ్యంగారి యాజమాన్యమునకు వచ్చిన 'స్వదేశమిత్రన్' పత్రికకు మరలసహాయసంపాదకుఁడుగ నేర్పడి, వ్యాసములను గథలనువ్రాయుచుండెను. ఇంతలో నారోగ్యము క్రమముగ క్షీణింపఁగా, 11-9-1921 తేదీని భారతి తిరువల్లిక్కేణిలో కాలధర్మ మొందెను.

భారతి సృజించిన సాహిత్యము నిప్పుడు సూక్ష్మముగ గమనింతము. ఆయన వివిధరచనల వ్రాసెను. ఆయన పద్యకావ్యములన్నిటిలో ముఖ్యము 'పాంచాలీశపథము'. ఇది రెండుభాగములుగల మహాకావ్యము; కథావస్తువు మహాభారతములోనిదని దీనిపేరులోనే సూచితమయినది. పాండవుల యుత్తమగుణములు, దుర్యోధనునకు పాండవుల సౌఖ్యవార్తవలన నసూయజనించుట, విదురదౌత్యము, సభారంగమున జూదమాడుట, పాండవుల వివశత, అన్నదమ్ముల స్వభావభేదము, ద్రౌపది సభకు రప్పింపఁబడి, తనకు న్యాయము నిప్పింపుమని సభలో వాదించి యాక్రోశించి తుదకు శ్రీకృష్ణుని బ్రార్థించుటయుఁ జాల మనోహరముగ రసపుష్టితో నీగ్రంథమున వర్ణింపఁబడినవి.

ఈ మహాకావ్యములో నాలంకారికపద్ధతిని నదీపురసూర్యాస్తాదుల వర్ణనము చేయఁబడినది. విషయమందటికిని దెలిసినదయినను స్వతంత్రగ్రంథమువలెఁ గథావస్తువు పాత్రలస్వరూపస్వభావములు సుందరముగఁ జిత్రింపఁబడినవి. శైలి కఠినపాకము గాక సామాన్యజనులకును

తెలియునట్లు మృదుమధురముగ వ్రాయఁబడినది. భారతి కొన్ని ఖండ కావ్యములఁగూడ రచించెను. వీనిలో 'కుయిల్' అనునది యొక స్వప్న కథను వివరించు శృంగారరసకావ్యము, 'నిలావుమ్ వాన్మినుమ్ కాత్తుమ్' 'వణ్ణిలా' అను శాంతప్రధానమగు ప్రకృతివర్ణనగ్రంథములును ముఖ్యములే. ఇవి యన్నియు మనోభావములఁ జిత్రించుటలోఁ బ్రాధాన్యము గలవి.

ఈయన కొన్ని విమర్శప్రధానమగు గ్రంథములఁ గూడ రచించెను. అందు భగవద్గీతను వేదమునుగూర్చి వ్రాసినవి ప్రధానములు. గీతలోనిమహత్త్వమును హిందూధర్మగ్రంథములలో దాని ప్రశస్తతను భారతి చక్కఁగా వివరించెను. భగవద్గీత జ్ఞానయోగప్రతిపాదకమే యని కొందఱు, కర్మప్రధానమనియితరులు, భక్తిప్రబోధకమేయని మఱియొక పక్షమువారును వాదింతురుగదా. ఇందేవాదమును సరికాదనియు, అది జ్ఞానకర్మభక్తుల సముచ్చయ బోధకమగు మోక్షశాస్త్రమని భారతి చక్కఁగా నీతమిళగ్రంథములో నిరూపించెను. తానొకరి వ్యాఖ్యానముపై నాధారపడక, స్వతంత్రగ్రంథముగనే దీనిని రచించెను. పతంజలి రచితమగు యోగశాస్త్రములోని సమాధిభాగము నీయన యనువదించి, దానికి తమిళములో విపులమగు టిప్పణి వ్రాసెను.

'వేద ఋషిగళిన్ కవిత్తై' అను గ్రంథమును ప్రశంసనీయము. వేదమందు ముఖ్యముగా ఋగ్వేదసంహితలోను, కొన్ని యుపనిషత్తులలోను జిత్రవిచిత్రమగు గాథలు, దేవవర్ణనలు గలవు. అగ్ని, మిత్ర, యమాది దేవతలు ప్రకృతిదేవతలు గనుక వేదఋషులు ప్రకృతి పూజకులేయని స్థూలదృష్టిని గొందఱు భావించిరి. కాని నిజముగఁ బ్రకృతి యంతయు నీశ్వరదేహమే గనుక నీయన్నిదేవతల కంతర్యామి యగు నేకేశ్వరుని సేవించుటయే వేదఋషుల యుద్దేశమని భారతి సహేతుకముగ నిరూపించెను. ఇట్లే యామాయాగాథల యంతరర్థమును గూడ వివరించి

ఋక్సంహితలోను దార్శనికమగు నున్నతభావములు గలవనిచెప్పి దాని యాధ్యాత్మికఘనత నతఁడు విశదపఱచెను.

భారతి రచనలన్నిటిలో నెక్కువ విరివియైనవి గీతములు. ఈగీతములు తమిళదేశీయు లందఱి గృహములలోను, సభలన్నిటిలోను సాధారణముగఁ బాడఁబడుచు విశేషవ్యాప్తినొంది యున్నవి. సంగీతసాహిత్యముల రెంటిలోను భారతి యద్భుతప్రజ్ఞగలవాఁడు. అతని గీతముల భావ మున్నతమగుటయేగాక శ్రావ్యతయు విశిష్టమైనది. ఇట్టిగీతముల నతఁడు వేలకొలఁదిగ రచించెను. మన యాంధ్రములోను రంజకమగు గీతముల నెందఱో రచించినారు. కాని, ప్రాచీన ద్రావిడ గ్రంథముల లోవలె భారతి గీతములలో మాధుర్యముతోపాటు నున్నతాదర్శమును సంఘక్షేమ పరత్వావేశమును ప్రధానముగఁ బొడఁచూపుచుండును. ఆయన గీతములలో నైతికోద్దేశము నుండును. సత్యశివసుందరభావముల సమన్వయము భారతికవిత్వవిశిష్టతకు సూచకము.

ఈగీతములలోఁ గొన్ని రాజకీయములు. ఇవి జాతీయభావమును దేశభక్తిని బెంపొందించును. సామాన్యజనులలోను దేశాభిమానము వ్యాపించుటకీ గీతము లెంతయో తోడ్పడినవి. భారతదేశపు ఘనతను సర్వసంపూర్ణతను మన ప్రాచీనుల మహత్త్వమును దేశమాతఋణమును దీర్చుకొను బాధ్యతను నిరూపించుచు భారతి తనగీతములద్వారా సంఘములో నుత్సాహమును జనింపఁజేసి ప్రబోధముగల్గించెను. వీనిపైనఁ బ్రజాభిమానము దినదినమును హెచ్చుచున్నది గాని తగ్గుటలేదు. ప్రేమచందు, బంకిం, రవీంద్రులవలె భారతియు గొప్ప జాతీయవాది యగుట సహజమే. సాహిత్యము యొక్క ముఖ్యోద్దేశ్యము వినోదమును మనోవికాసమును, విషయజ్ఞానమును జనింపఁజేయుటయే కాదు, సంఘలోపములను బోఁగొట్టి పునర్నిర్మాణమునకుఁ బూనుకొని యందులకై రచనలు చేయువారే ప్రజాక్షేమకరులగు మహాకవు లగుదురు. (వాల్మీకి కాళిదాసుల నిట్టి జాతీయకవులే.) ముఖ్యముగఁ బరాధీనదేశములో

సంఘోన్నతికిముందు జాతీయస్వాతంత్ర్య మేర్పడుట యవసరము. కనుక సంఘక్షేమమునకు యత్నించు సీమహాకవులు జాతీయ జీవితము నుద్ధరించి పునర్నిర్మాణమునకు సాధకములగు రచనలఁజేయవలసివచ్చెను. భారతీయైక్యమును స్థాపించుటకు, స్త్రీలయున్నతిని సర్వజాతిసమత్వమును బోధించుటకుఁగూడ భారతి చాల గీతముల వ్రాసెను. కాని, స్వాతంత్ర్యపు ఘనతను, ఆవశ్యకతను యువకులకు బోధించు గీతములే యెక్కువ ప్రసిద్ధమయి విశేషప్రచారముఁ గాంచినవి. వానిశైలి యీ క్రిందిపద్యములవలనఁ దెలియును.

'విణ్ణిలిరవితనే విట్టువిట్టువరుంపోయ్, మిన్మినికొల్వారో
కణ్ణిలుమినియ సుతంత్రం పోనపిన్, కైకట్టి పిఱైప్పారో'

(=మిన్నున శోభించు రవిని వదలి యెవరైన మిణుగురును కొల్తురే, కండ్లయెదుట స్వతంత్రత పోఁగా చేతులఁగట్టుక జీవింతురే !)

'మణ్ణిలిన్బంగళే విరుం బిచ్చుతంతిరత్తిల్ మాణ్బినైయియప్పారో?
కణ్ణిరండుంవిట్రు చిత్తిరం వాంగినాల్ కైకొట్టి శిరియారో ?
(సుతంత్రప్పెరుమై)

(=మంటిఁబోలు భౌతికరుచులమఱఁగి స్వాతంత్ర్యపు ఘనతను వదలుదురా ? రెండుకండ్లనమ్మి, అందులకు బదులుగ చిత్తరువును దీసికొన్న,చప్పట్లుకొట్టి నవ్వరా ?)

భారతి భక్తిపూరితమగు ధార్మికగీతములఁగూడఁ జాలరచించెను. 'నాలాయిరం' మొదలగు ద్రవిడవేదాదుల ననుసరించి, వీనిలోఁ జాలవటికు 'కణ్ణన్'(అనఁగా శ్రీకృష్ణమూర్తి)చిద్విలాసమునకుఁబ్రాధాన్యమీయఁబడినది. కొన్నిచోట్ల బాల్యలీలలు, పిమ్మట నాయకుఁడు, ఆచార్యుఁడు, రక్షకుఁడు, ఇట్లు వివిధభావనలు గలవు. (ఉ."మనసారథి, మనసచివుఁడు, మన దైవము, మనగురుండు, మనబాంధవుఁడున్, మన విభుఁడు,గురుఁడు, దేవర ... ..."భాగవతము) ఇట్లు వివిధావస్థలలో జీవపరమాత్మల సంబంధము వేర్వేఱుగవర్ణింపఁబడి, పామరులకు నుద్బోధకముగనున్నది. ఇందు

కొన్నిటిని జయదేవాదులవలె శృంగారభూయిష్ఠముగ రచించినను, కేవలము పరమార్థద్యోతకముగ వేదాంతార్థములోనే, రచించినవియుఁ గలవు. తరువాత, అనఁగా పుదుచ్చేరివాసములో రచితమగు గీతములఁబట్టి, అక్కడి యస్వాభావికమగు నిరోధజీవితముచేఁ గవి కేర్పడిన మనః పరిణామము సూచితమయినది. ప్రేమప్రధానమగు వైదికమతమునుండి మాతృభయభక్తియుతమగుశక్తిపూజను శ్లాఘించుటఁబట్టియాకాలమందీతనికి శాక్తమతమందు మనస్సులగ్నమయినట్లు సూచితమును. కాని కొన్ని పద్యములు వేదాంతప్రధానములును గలవు. 'మాయయై పయిత్తల్, జీవన్ముక్తి' ఇత్యాదులీజాతివి. భయమను భూతమును అసత్యమను సర్పమును సంహరించుట నిజమైన జయమని యతఁడు వివరించెను.† విశ్వమందలి జీవజాతులెల్లకే ప్రాణికుటుంబమునకుఁ జెందినవి కనుక జనులకు భూతదయ యావశ్యకమనియుఁ జాలచోట్ల నీకవి హెచ్చరించినాఁడు.* ఇప్పటి యాంధ్రవాఙ్మయములోవలె కేవలము సాహిత్యప్రభావము గల గీతములఁగూడ భారతి రచించెను. ఇవి వివిధాంశముల వర్ణించునవి.

'తమిళ్, మాజినీ, విడుదలై, పుదియరుషియా, భూపేంద్రవిజయమ్, సుతంత్రపేరుమై, సూర్యదర్శనం, తమియ్‌తాయి, వెణ్ణిలా' ఇత్యాదులు, అందలి కవిత్వశైలికి రమ్యతకు తమిళనాడు నందంతటను ప్రసిద్ధికెక్కినవి. కాని, వీనిలోను జనులకుఁ బ్రబోధమొసర్చు నావేశము గోచరించునని పాఠకులు గమనింపఁగలరు.

భారతి తమిళవచనవాఙ్మయములోఁ గ్రొత్తశైలి నేర్పఱిచెను. తానుగొప్పవిద్వాంసుఁడైనను జాల సులభమగు రమ్యశైలిలోనే సుబో

† "భయమెన్నుమ్ పేయ్తనై యడిత్తోమ్—పొయ్మైప్పాంబై పిళందువు యిరై క్కుడిత్తోమ్" (జయభేరికై.)

* కాక్కై కురువి యెంగళ్ జాతి— నీళ్
కడలుమలైయుం ఎంగళ్ కూట్టమ్,
నోక్కుందిశై యెలాం నామన్రి వేఱిల్లై
నోక్కనోక్క కళియాట్టమ్. (")

ధకముగ వ్రాయుచుండెను; అట్లని పటుత్వము పోలేదు. కొన్నిపురాణ గాథలు, ఇతిహాసకథలును, అనువాదములుగను, అనుకరణములుగను చక్కని మృదుమధురశైలిలో వ్రాయఁబడినవి.

'జ్ఞానరథం' అను వచనకావ్యము విచిత్రమయినది. 'ఈశ్వరుఁడు జ్ఞానమను విమానమును ప్రతివారికిఁ బ్రసాదించినాఁడు. దానిని సరిగ నుపయోగించుకొంటిమా, ఎట్టియున్నతస్థితికైనఁ బోవచ్చు; ఎట్టి యద్భుతదృశ్యములఁగూడ దర్శించి, మహోన్నతదశ ననుభవింపవచ్చు' అను భావము దీనిచేఁ బ్రతిపాద్యము. ఉపశాంతిలోక, సత్యలోక, ధర్మలోక, జ్ఞానలోకముల స్థితిని మన 'మృత్యులోక'పు స్థితితోఁబోల్చి యీ గగన విహారకథలో భారతతత్త్వశాస్త్రసారము నంతను నిమిడ్చియున్నాఁడు.

'చంద్రికైయిఁకథై' అనునది సాంఘికము. దానికథ చాల మనోహరము. మనసాంఘికలోపములఁ బోగొట్టు సంస్కారణోద్దేశముతో భారతి యీనవలను రచించెననుట స్పష్టము. విధవావివాహము సంఘక్షేమకరమనియు బ్రాహ్మణశూద్రులమధ్యను వివాహమును నిజముగఁ బ్రేమజనితమయినప్పుడు నిర్దోషమనియు నిందలి కథవలన సూచితము. మఱియు భారతి సందర్భోచితముగ నీనవలలో దాక్షిణాత్యసంస్కర్తలలో ముఖ్యుఁడగు జి సుబ్రహ్మణ్యయ్యరును,ఆంధ్రసంస్కర్తలలో నగ్రేసరులైన మహాకవి శ్రీ వీరేశలింగంపంతులుగారిని గథాపాత్రలుగఁబెట్టి వారిట్టిసంస్కారణలకొఱకుఁ బ్రచారమును బ్రత్యక్షకృషినిజేసి ధన్యులైనట్లు యథార్థకథనుగూడ నిందు మిళితముచేసి వివరించినాఁడు. ఇందువలన భారతికి మన వీరేశలింగంగారిపైన విశేషగౌరవముండెననియు నిందువలన వ్యక్తమయినది. (భారతికి తెలుఁగు హిందీ బంగాళీభాషలును దెలిసియుండెను)

'తరాసు' అను చిన్న వచనగ్రంథము హాస్యరసభరితము. ఇందు వివిధజనుల ప్రవృత్తులు మంచిచెడ్డలు చర్చింపఁబడినది. వారి వారిప్రశ్నలను జెప్పుసబబులను 'తరాసు' గారు తూనికవేసి చూచి, అందలి సార

షును నిర్ణయించి జవాబిచ్చుచుండును. ఇది సంభాషణరూపమగు రచన. ఇందులో మద్రాసు వకీలు, పత్త్రికావిశేఖరి, 'ధర్మసంకటం వైద్యనాథయ్యర్' అను జడ్జిగార్లకు 'తరాసు' చెప్పిన సమాధానము లానందకరమే గాక చాల జ్ఞానప్రదమును; ఇందు మహోన్నతమగు నాశయము లెన్నియో వినోదరూపముగనే తెలుపఁబడినవి.

సంస్కృతములోని పంచతంత్రము రీతిని చిన్నచిన్నకథలు, అందుండి తెలియఁదగు నీతులుగూడ సూచించు వచనగ్రంథమొకటి బాలురకు నుపయోగించు సులభశైలిలో 'నవతంతిరక్కథైగళ్' అను నొకపుస్తకముగూడ భారతి రచించెను. మఱియు, ఆధునికరీతిని short story అనఁబడు చిన్నకథల నెన్నిటినో భారతి వ్రాసి ప్రచురించెను. ఇందు కొన్ని రవీంద్రనాథుని కథల కనువాదములు, కొన్ని స్వతంత్రరచనలు. ఇవియన్నియు మనోజ్ఞములై రసవంతములై, చక్కని శైలిగల్గి, చదువరుల నాకర్షించుచుండును.

ఇవిగాక, పత్త్రికాసంపాదకుఁడుగ భారతి యనేక వ్యాసముల నాయాపత్త్రికలలోఁ బ్రచురించెను. ఇవియార్థికసాంఘికరాజకీయాది వివిధ విషయములకు సంబంధించినవి. జనుల కున్నతభావములను సత్ప్రవృత్తిని గల్గించునవి. స్త్రీజనోన్నతికి నిమ్నజాతిజనుల యుద్ధారణకుఁ గూడ నుద్బోధించుచు నాయునరచనల నుపయోగించెను. భారతి కొన్నియాంగ్ల రచనలు తిలకుగారి యుపన్యాసములు ఇత్యాదులనుదమిళమున కనువదించెను; తానువ్రాసి ప్రచురించిన కొన్నిగీతములను దానే యాంగ్లమునఁ బ్రచురించెను. అవి కొలఁదియైనను రమ్యముగనున్నవి. కాని వానికి రవీంద్రగీతములకుఁగల వ్యాప్తి ఖ్యాతులు కలుగలేదు.

ఇట్లు భారతిగారి ముఖ్యరచనలవల్ల నీయన సాహిత్యసేవ పరిశీలన యద్భుతమైనదని తేలినది. జాతీయజీవితమును పునరుద్ధరించు భావములే గాక నవ్యశైలియు భారతి సాహిత్యసేవలోని విశేషమే. ఆంధ్రవాఙ్మయ పూర్వకవులు మాఱుమూలపదములను జటిలమగు సంస్కృతశబ్దజాల

మును వాడినట్లే, తమిళపు ముఖ్యకవులును ప్రాచీనమగు అచ్చ తమిళపదములనే వాడుట కవిసంప్రదాయముగ భావించిరి. సంస్కృత పదము లన్యభాషాపదములనియు వానిని జేర్చుట తమిళశైలికి దోషముగుననియు వారిలో వాదము కలదు. ఈరెండుపద్ధతులనుమాని భారతి వాడుకలోని సులభపదములనే ముఖ్యముగ వాడుచు జిగిగల నవ్యశైలిని సృజించెను. ఇదిసామాన్యజనులందఱికిని బోధపడునుగనుకఁ బ్రజలందఱికిని జ్ఞానవ్యాప్తిగల్గుట కవకాశమేర్పడినది. జనపదములలో వాడుకలోనున్న వృత్తములనుగూడ సాహిత్యమునకు సమన్వయించి క్రొత్తవృత్తములు కూర్చుటయు నాయనగీతములలోని విశేషము. ఆయన రచనలలో శృంగారముకన్న వీరశాంతహాస్యాదులకు నధికస్థాన మీయఁబడినది. ఈమృదుమధురశైలి యీశతాబ్దిలోఁ దక్కిన తమిళలేఖకులకు మార్గదర్శకమయినది. ఈయన వైజ్ఞానిక భావములను గూడ మధ్య మధ్య సులభపదములలోఁ దెల్పును. కాళిదాసువలె ప్రకృతి వర్ణనలను, స్వభావోక్తి, ఉపమ, అర్థాంతరన్యాసము, ఇట్టియలంకారముల ద్వారా చక్కని గంభీరమగు నిత్యసత్యభావములను లోకోక్తులను మృదుమధురముగఁ జేర్చుటయు, భారతిశైలిలో విశేషము గలదు. ఈజాతీయకవి రచనాధోరణి కొంతవఱ కాంధ్రకవులలో శ్రీ రాయప్రోలు సుబ్బారావు విశ్వనాథ సత్యనారాయణగార్లవంటి యాధునిక కవులకుఁగలదు. కాని భారతి యమితోత్సాహమును భావోద్రేకమును, ఉన్నతజాతీయతను సర్వజనరంజకముగఁ బ్రదర్శించుటయు నాంధ్రకవులలో నింకను రావలసి యున్నదని తోఁచును.

ఇట్లు సామాన్యులకును సుబోధమగు శైలిని గద్యపద్యముల వ్రాసినను, భారతి మనలో వ్యావహారికమనఁబడు సంభాషణభాషలో రచనలఁజేయలేదు; ఆయనశైలి నిర్దుష్టమై వ్యాకరణనియమములకు లోఁబడియున్నది. తెలుఁగులోవలె తమిళములోను సాహిత్యభాషకు వాడుక భాషకుఁ గొంతభేద మున్నది.

ఆయాజిల్లాల మాతృకభాషలోను గొంత ప్రాంతీయభేదము కలదు. ప్రజలు మాట్లాడుకొనురీతినే సాహిత్యమును రచించునప్పుడు వాని భాషలో ప్రాంతీయభేదములు మఱికొన్ని బాధలును గలుగకతప్పదు. నేఁటికిని తమిళసాహిత్యము చాలవఱకు వ్యాకరణదృష్టిని నిర్దుష్టమగు సులభశైలిని వ్రాయఁబడుచున్నదనియు నందులకుఁ గొంతవఱకు భారతి పద్ధతి కారణమనియుఁ జెప్పుదురు.

కొన్ని ముఖ్యవిషయములలో నితనికి రవీంద్ర మహాకవితోఁ బోలికయు, కొంతభేదమును గలవు. ఉభయులును విద్వాంసులపుత్త్రులై స్వతఃప్రతిభావంతులై బాల్యమునుండి సహజకవిత్వధోరణి గల్గి, 15 ఏండ్లవయస్సుననే మహాకవులని పేరుఁ గాంచిరి. కొంద ఱాంధ్రకవుల ధారలవలెఁగాక, వారి యాశుకవిత్వమును సారవంతమై, సంఘక్షేమకరమై యుండెను. ఉభయులును 1905 నుండి గొప్పజాతీయవాదులై, దేశభక్తిని జాతీయోత్సాహమును జనులలోఁ బురికొల్పుటకుఁ దమ మేధాసంపత్తును రచనాశక్తిని మనస్ఫూర్తిగ వినియోగించి, కృతార్థులయినారు; సామాన్యులగు విద్వాంసులకుఁగూడ రంజకముగ నపూర్వవృత్తములందు మనోహరగీతముల వ్రాసి స్వభాషకు జాతీయతకుఁగూడ సేవఁ జేసిరి. ఉభయులును సంగీతమందుఁ జక్కని ప్రజ్ఞ గల్గి, శ్రావ్యముగ స్వయముగాఁ బాడి, ప్రజలమనస్సు నాకర్షించిరి; పూర్వసాహిత్యపు టుత్తమసంప్రదాయములఁ గనిపెట్టి, దాని నాధునికవిజ్ఞానముతో సమన్వయింపఁ జేసిరి. వారిగీతములు రంజకములేగాక, ఉద్బోధకములును. ఉభయులు నాధ్యాత్మికదృష్టిగల్గి నీతిబోధకులై, యాదర్శయుతమగు చిన్నికథలఁగూడ వ్రాసిరి; ఉభయులు కొంతవఱకుఁ బత్రికాసంపాదకులై, యార్థికసాంఘిక విషయములందు జనులకు నుదారతను గల్గింపఁ దోడ్పడినారు. స్వభాషాప్రీతికి జాతీయతకుఁదోడు, ఉభయులును విశ్వజనీనభావముగల్గి, ప్రేమతత్త్వమును బోధించిరి; భూతదయాపరులై యుండిరి.

ఇఁక నుభయులలో భేదమును గమనింతము. రవీంద్రుఁడు కష్టములపాలైనను వ్యాకులతకు లోఁబడలేదు; విశ్వకవివలెఁగాక, భారతియార్థిక బాధకుఁ బాల్పడి, చాలదుఃఖితుఁ డాయెను; సంఘసహకారము నతఁడంతగాఁ బొందలేదు. ఉభయులు జాతీయోద్యమములోఁ బాల్గొన్నను, 1907 లో నది తీవ్రరూపముఁ దాల్చినపుడు వారి ప్రవృత్తి భేదించినది. రవీంద్రుఁడు ప్రత్యక్షరంగమును వదలెను; కాని హింసాధోరణిని నిరసించుచు, క్షేమకరమగు జాతీయోన్నతిమార్గమును సర్వజనప్రేమతత్త్వమును మఱింత తీవ్రతతో బోధించుచు, లోకమంతకును మహోపకారముఁ జేసెను. అందులకై గొప్ప నవలలు, నాటకములు గూడ నద్భుతముగ రచించెను; లోకసంచారముచేసి యన్యదేశీయులకు ధైర్యముతో హితబోధఁజేసి, విశ్వవిఖ్యాతిఁగాంచెను; నిర్మాణాత్మకమగు గొప్ప విద్యాసంస్థలను నాశ్రమమును స్థాపించి, చాల లోకోపకారముఁ గావించెను. ఇట్టి విషయములలో నా గురుదేవునితో భారతి నెంతమాత్రమును బోల్చుటకు వీలులేదు. 1907 సం॥పు తీవ్రోద్యమములో భారతి సర్కారునకు భయపడి పుదుచ్చేరిలో యేకాంతవాసియై, లోకప్రవాహముతో సంబంధముఁ గోల్పోయి, తనశక్తులు వ్యర్థమగుచుండఁ గృశించిపోయెను. రవీంద్రునిసాహిత్యము ముఖ్యభాషలన్నిటిలోని కనువదింపఁబడినది. భారతి తెలుఁగు, కన్నడము, హిందీ, బంగాళీ భాషలు గూడ నేర్చుకొనెను; ఆంగ్లసాహిత్యసారమును గ్రహించెను. ఇద్దఱి మధ్యను విభేదమునకుఁ గొంతవఱకాయుఃప్రమాణభేదమును గారణమయినది. దైవకృపవలన జనుల యదృష్టమువలన, రవీంద్రుఁడు దీర్ఘాయువై, 65 ఏండ్లు నిరంతర ముత్తమసాహిత్యము నిర్మించి, అపారమగు లోకసేవఁజేయగల్గెను; ప్రత్యక్షవ్యక్తిప్రభావముచే నెందఱికో, ఎన్ని సంస్థలకో పునరుజ్జీవనము గల్గించెను. భారతియో, శంకర వివేకానందులవలె నల్పాయుష్కుఁడై, 30 ఏండ్లకే లోకసేవ చాలవఱకు ముగించుకొని, త్వరలోనే మరణించెను; ఆయన వ్యక్తిప్రతిభను, సాంఘిక

సాహచర్యమును లోక మనుభవించుట యరుదయినది. తమిళలోకములో మాత్ర మాయన రచనలప్రశస్తి యధికమే. ఆయన 'జ్ఞానరథము, తరాసు' కొన్నిగీతములు, హిందీలోనికిఁ దర్జుమాయయినవి. భారతి భార్య చెల్లమ్మయు కొమార్తె తంగమ్మయు జీవించియున్నారు; వారు నేఁటికిని బత్త్రికలలో వ్యాసములవ్రాయుచు, సాహిత్య విషయములందు శ్రద్ధగల్గి యున్నారు.

భారతిగారి యీక్రింది సర్వ సమత్వపు గీతములతో నీసమీక్షను ముగించుదము.

విడుదలై !

పత్తయరుక్కుమింగు తీయర్ పులై యరుక్కుం విడుదలై
పరవరోడు కుఱవరుక్కు మఱవరుక్కుం విడుదలై
తిరమైకొండతీమైయ త్తగొయిల్ పురిందుయావరుం
తేర్న్దకల్వి, జ్ఞానమెయ్ది, వాయ్వమిందనాట్టిలే॥
ఏழைయెన్రుం అడిమైయెన్రుం ఎవనుమిల్లై జాతియిల్
ఇయివుకొండ మనిదరెన్ప దిందియావిలిల్లైయే
వాయ్కల్వి, శెల్వమెయ్ది, మనమదియ్న్దుకూడియే
మనిదర్యావరుమొరు నికర్ సమానమాగవాయ్వమే॥

(విడుదల ! పరులతోఁ బాటు మాలమాదిగలు శెట్టిగ బోయులు వగైరాలకును స్వతంత్రత కల్గుగాక ! ఈ దేశములో పుట్టిపెరుగు సర్వజనులు సమభావముతో సుఖులై జ్ఞాన విద్యావంతులు కావలె ! జాతిలో బీద శ్రీమంతుఁడు నీచులు అధికులు అను విభేదమిండియాలో లేదు. జ్ఞానైశ్వర్యములతో మనము కలిసియుండుచు, జనులందఱము సరి సమానముగ క్షేమ మొందుదుము గాక !)

---

# తాటియాకులతడవులాటలు.

చిలుకూరి పాపయ్యశాస్త్రి, మేనేజరు:- పరిషత్తు,

---

## అంబావిలాసము.

శ్రీ దేవీస్తోత్రపరమగు నీసంస్కృతగ్రంథము 105 శ్లోకములుగల శతకము. శైలియందును భావగాంభీర్యమునందును, మంత్రశాస్త్ర రహస్యప్రతిపాదనమందును శ్రీశంకరభగవత్పూజ్యపాదవిరచితసౌందర్య లహరిని బోలియున్నది. ఈశతకమును రచియించిన కవివరేణ్యుఁడు విద్యావిలాసార్ణవుఁడను భువనానందనాథుఁడు. 'విద్యావిలాసార్ణవ' అనునది బిరుదవాచకము కానోపును. ఈతఁడు విజ్ఞానానందనాథగురు వరేణ్యుని శిష్యుఁడు.

శ్లో. విజ్ఞానానన్దనాథాహ్వయగురుకరుణాసాక్షితో...ద్య
 ద్వాణీ శృంగారలీలావలయితకవితావైభవే నావృతేన
 నామ్నా విద్యావిలాసార్ణవ ఇతి భువనానందనాథేన సమ్యక్
 స్తోత్రం సంపూర్ణ మాసీత్ కృత మఖిలమనోరమ్య మంబావిలాసమ్.

ఈ యంబావిలాసమున, పరాంబికావిలాసము సమగ్రముగా వర్ణింపఁబడినది. "వన్దేఽహాం భవదీయదివ్యచరణద్వంద్వం పరాదేవతే" అనునది యీ శతకమున కంతకును మకుటము.

ప్రారంభము:—

శ్లో. శ్రీవిద్యే చరణారవిందయుగలధ్యానక్రియావేదినాం
 భక్తానాం విదుషాంచ కల్పలతికే మాయాకలామాలికే
 సృష్టిస్థిత్యుపసంహారాది వివిధన్యాసక్రియాకోవిదే
 వన్దేఽహాం భవదీయ దివ్యచరణద్వంద్వం పరాదేవతే.

శ్లో. పీయూషార్ణవ మధ్యకల్పితమణిద్వీపే కదంబద్రుమైః
మందారైః కుసుమాన్వితైః పరివృతే రత్నాలయే చావ్యయే
ఆనందామృతవాటికాంతరగతే మంచే శివాఙ్కస్థితే
వన్దేహం ... ... ... ... ... ...

శ్లో. భ్రూమధ్యే ద్విదలాంబుజే గురుమనస్థానేచ హాక్షాన్వితే
మాణిక్యద్యుతిపాటలాయితదలై ర్యుక్తే చతుష్షష్టిభిః
తత్పీఠస్థితదేవతావలయితే తత్కర్ణికాంతస్థితే
వన్దేఽహం భవదీయ దివ్యచరణద్వంద్వం పరాదేవతే.

శ్లో. బ్రహ్మస్థానసరోరుహే దశశతైః పత్రైస్సువర్ణై ర్యుతే
మాలామంత్రనియంత్రితాభి రఖిలాభి ర్దేవతాభి ర్వృతే
తేజోరాశిమయే సుధాస్పదపదే తత్కర్ణికాసంస్థితే.
వందేఽహం భవదీయ దివ్యచరణద్వంద్వం పరాదేవతే.

తుదిశ్లోకము: —

శ్లో. ప్రాతఃకాలే దినాంతే కృతజపసమయే స్తోత్రమేతన్నిశాయామ్
భక్త్యా సత్కర్మనిష్ఠా యతిగురువచనా దీరితం యే పఠన్తి
వాక్సిద్ధిం మంత్రసిద్ధిం సుమధురకవితానాట్యగానాదిసిద్ధిం
స్త్రీవశ్యం రాజవశ్యం లభతి పరముఖస్తంభనం మోహనంచ.

ఈగ్రంథము 8 పత్త్రములలో వ్రాయఁబడినది. పత్రములు మంచిస్థితిలో నున్నవి. వ్రాఁత బాగున్నది. తప్పులంతగలేవు. శ్రీవిద్యోపాసకుల కీగ్రంథ మవశ్యపఠనీయము. ముఖ్యముగ నాముష్మికార్థసంధాయకము. మంత్రాతురగ్రథితముగాన గురుముఖమున నుపదేశముఁ బొందినవారికాని పఠించుట యుక్తము గాదని యీ శ్లోకములలోఁ దెలుపఁబడినది. ఫలశ్రుతిని బురస్కరించుకొని పాఠకు లన్యథాభావింప కుండెదరుగాక.

## శ్రీకృష్ణకర్ణామృతాధ్యాత్మవార్తికము:

శ్రీకృష్ణకర్ణామృతమును రచియించిన శ్రీకృష్ణ లీలాశుకయోగీంద్రుఁడు కేరళదేశీయుఁడని సోపపత్తికముగ నిరూపించుచు శ్రీయుత మానవల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ గారు దుందుభి సంవత్సరపు టుగాది సంచికలోని "పుష్పాంజలి శ్రీకృష్ణలీలాశుకకవి" అను వ్యాసమును బ్రకటించియున్నారు. శ్రీ కవిగారు దెలిపినటులు లీలాశుకుఁడు కేరళదేశీయుఁడే యనుటకుఁ గొంతవఱకు నీవార్తికగ్రంథము సహకారమగునే మోయని నాయూహ. ఏమందురా ? ఈవార్తికమును రచియించిన కవివతంసుఁడును కేరళదేశీయుఁడే.

ఇఁక నీ 'కృష్ణకర్ణామృతాధ్యాత్మవార్తిక' మను సంస్కృతగ్రంథము పరిషద్భాండాగారమున 3501 సంఖ్యగలది. 39 పత్రములుగలది. పత్రములు 19×1 ప్రమాణముగలవి. పుట కయిదు పంక్తులు గలవు. వ్రాఁత చక్కఁగ నున్నది. తప్పులు లేవు వ్రాయసగానిపేరు లేదు. తుదిపత్రమున ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశంకర భగవత్పాదకృత శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యావర్తన నిరతేన చిదాభాస చిత్స్వరూప నరనారాయణభక్తేన శ్రీరాఘవేంద్ర సరస్వతీశిష్యేణ కేరళీయేన బాలగోపాలేంద్ర యతీంద్రేణ కృత మిదం కృష్ణకర్ణామృతాధ్యాత్మవార్తికం బోధామృతం సంపూర్ణం." అనికలదు. దీనిచే నీవార్తికకర్త కేరళదేశీయుఁడును రాఘవేంద్ర సరస్వతి శిష్యుఁడును, శ్రీకృష్ణభక్తుఁడును, అద్వైతానుసంధాన పరాయణుఁడనియుఁ దెలియుచున్నది. శ్రీకృష్ణకర్ణామృతము కేరళదేశమునందే ప్రథమమున నుదయించి ప్రచారముఁ గాంచియుండుట చేతను, అద్వైతానుసంధానపరాయణుల కాస్వాద్యమగుట చేతను నీకేరళదేశీయుఁడగు యతీంద్రుఁడు శ్రీకృష్ణుని శృంగారచేష్టల కద్వైతపరముగ నర్థమును దెలుపు నీవార్తికగ్రంథమును రచియించియుండఁనోపు.

ఈవార్త్తికములు శ్లోకరూపములు. కర్ణామృతమునందు మూఁడు శతకములవలె నిందును మూఁడు ఖండములు. ప్రథమఖండమున 286 శ్లోకములు, ద్వితీయఖండమున 123 శ్లోకములు. తృతీయఖండమున 117 శ్లోకములునుగలవు. కర్ణామృతమునందలి శ్లోకములప్రతీకలఁ గైకొని, ఒక్కొకచో నొకశ్లోకమునే రెండుమూఁడునాలుగైదుశ్లోకములచే వివరించుట గలదు. అడుగడుగునకు నద్వైతసిద్ధాంత రహస్యములను వర్ణించుచుండును. శారీరక మీమాంసాభాష్య మావర్తించినవారికేగాని యీతని వార్త్తికసార మవగతముకాదు. లీలాశుకుఁడు కృష్ణభక్తితరంగితుఁడై భగవానుఁడు తననోట నేది పలికించినాఁడో దానినే మధురముగ గానముచేసినాఁడు. ఈయతీంద్రుఁడును నట్లే యద్వైతానుసంధానపరాయణుఁడై కృష్ణపరమాత్మ తననోట నెద్దానిని బ్రవ్యక్తముచేయ నెంచినాఁడో దానినే దెలిపినట్లు యీక్రిందిశ్లోకము చాటుచున్నది.

శ్లో. కృష్ణం గురుం సర్వహృదేకసాక్షిణం
స్వాత్మానమీశం బహుశోఽపి నత్వా
తదీయకర్ణామృతవార్త్తికం ముదా
తత్ప్రేరితేన క్రియతే మ యేదమ్.

కృ. క. వార్త్తికమ్. ప్రథమఖండమ్. ౪.శ్లో.

శ్రీకృష్ణునిఁ బరమేశునిగాను, ఆతని లీలాసామగ్రిని జ్ఞానసామగ్రినిగాను దెలిపి యద్వైతరసామృతాస్వాదనముఁ జేయుట యీకవివర్యునికిఁ బ్రధానలక్ష్యమై వెలసినది. కావున శ్రీకృష్ణుఁడు పరమాత్మస్వరూపుఁడైన యీశుఁడు, గోపికలు చిద్వృత్తులు, ఆగమాంతాధ్యేతలగు గొల్ల లాత్మాహంకారవర్గము, వేణువు జ్ఞానము, నెమిలిపింఛము అమలమయిన జ్ఞానవిషయము, వేణుగానము బ్రహ్మవిద్య, గోవులు సమస్తమయిన యింద్రియములు నని నిరూపించి శ్రీకృష్ణుని వేణుగానవిలాసవిచేష్టిత మధ్యాత్మశాస్త్రార్థమని తెలిపి, యావిషయమునే తుదివఱకు సమర్థించినాఁడు. ఆప్రసంగము నిట నుదాహరించుచున్నాఁడను.

శ్లో. స్వాత్మాన్వై కృష్ణ ఈశో నిఖిలవిమలచిద్వృత్తయో గోపికా హి
స్వాత్మాన్మహంకారవర్గా స్సకలసుఖదగోపా స్స్వధీతాగమాన్తాః
వేణుర్జ్ఞానం సుపింఛం స్వవిషయ మమలం తత్ప్రియా బ్రహ్మవిద్యా
గావ స్సర్వేంద్రియాణి ప్రజయతి సకలాధ్యాత్మశాస్త్రార్థ ఏవమ్.

మచ్చున కొక శ్లోకమునకు వార్తికములు—

అస్తిస్వస్తరుణీః—

శ్లో. మాయాసంశుద్ధ సత్త్వోల్లసదభినవ చిద్వృత్తి సంస్కారముఖ్య
ప్రస్త స్వాభీష్టదం చిత్పరివృత మఖిలోత్కృష్ట మేవాత్మతత్త్వం
బ్రహ్మారబ్ధప్రశస్తోదిత నిగమశిరోవాగ్జవిద్యాబలోద్య
న్మోక్షానందం స్వపష్టం విమల మనుపమం సచ్చిదానందరూపమ్.

శ్లో. ప్రత్యగ్బ్రహ్మైక్యనిష్ఠాగత చిదమలసంస్కార సందోహదత్తా
న్రమానంతాప్తి మోక్షాభయ మభిమతదం ప్రత్యగాకార మేకమ్
చిజ్జ్ఞానాతిచ్యుతా చిత్పునవరగమసంరుద్ధ హృద్గ్రంథి భాస్వ
చ్చిద్వృత్తివ్రాత పర్యావృత మమృతమజం నిత్య మస్త్వద్వితీయమ్.

ఇట్టి యద్వైతభావమును గాఢముగ వ్యక్తముసేయు వార్తికముల నీ బాలగోపాలేంద్రయతీంద్రుఁడు, శ్రీకృష్ణపరమాత్మ ప్రేరణచే లీలాశుకుని శృంగారాదిరససమంచిత శ్లోకములకు వ్రాయుటచే, లీలాశుకుఁడు యతీంద్రుఁడును తన భక్తిపారవశ్యతను దెలుపుటకే శ్రీకృష్ణకర్ణామృతమును రచియించెనని సుస్పష్టముగ విదితమగుచున్నది. కావున నిట్టి యుత్కృష్టగ్రంథమును మననము చేయుట కృష్ణాద్వయానుసంధానపరాయణుల కావశ్యకమని విని వేదించుచున్నాఁడను.

## తత్త్వసంగ్రహరామాయణము.

శ్రీరాముని పరతత్త్వప్రతిపాదకగ్రంథము. శ్రీమత్స్వయంప్రకాశానంద సరస్వతీపూజ్య పాదశిష్యులయిన శ్రీమద్రామబ్రహ్మానందస్వాములవారిచే నీగ్రంథము విరచింపఁబడినట్లు లీగద్యము తెలుపుచున్నది.

"శ్రీమత్ స్వయం ప్రకాశానంద సరస్వతీపూజ్యపాదశిష్య శ్రీమ ద్రామబ్రహ్మానందసరస్వతీస్వామివిరచితే. తత్త్వసంగ్రహరామాయణే బాలకాండ స్సమాప్తః."

శ్రీరాముని పరతత్త్వ మాయాపురాణములయందు వేర్వేఱు రీతుల వర్ణింపఁబడినది. కథాంశములయందును నించించుక భేదము గాన వచ్చెడిని. శ్రీస్వాములవా రట్టి వివిధాంశముల నొకచోఁ జేర్చి, యనుగతిఁ గూర్చి, శ్రీరాముని బరమాత్మస్వరూపునిగా స్థిరీకరించుచు నీగ్రంథమును గూర్చినారు. పురాణముల నన్నిటిని జదివి యందలి సారమును గ్రహించుట దుస్సాధము. అట్లు బహుపురాణసమ్మతాంశములు దెలియక శ్రీమద్రామాయణమునందలి మహర్షివాక్యముల తాత్పర్యమును నిర్ణయించుట దుశ్శకము. కావున శ్రీమద్రామాయణ రహస్యవేత్తల కీగ్రంథ మత్యంతోపకారకము.

మల్లినాథసూరియు,

"తే బహుజ్ఞస్య చిత్తజ్ఞే పత్న్యౌ పత్యు ర్మహీక్షితః
చరో రర్ధార్ధభాగాభ్యాం తా మయోజయతా ముభే".

(రఘువంశము. ౧౦ సర్గ. ౫౬. శ్లో)

అను శ్లోకమునకు వ్యాఖ్యానము సల్పుచు, ఒకయంశమునందే విభిన్నగ్రంథముల విరోధము గానవచ్చినచో పురాణాంతరముల సహాయమున సమాధాన మరయవలెనని తెలిపినాఁడు. పాయసవిభాగము విషయమున కాళిదాస వాల్మీకుల యభిప్రాయ విరోధమును నారదపురాణోదాహరణముచే సమర్థించినాఁడు. అట్టి సౌకర్య మీ తత్త్వసంగ్రహ రామాయణమునఁ గానవచ్చుచున్నది.

ఈప్రతి 1091 సంఖ్యగలది.తొలుతటిపత్త్రములు వాల్మీకి రామాయణమునందలి యుత్తరకాండము. ఆవెనుక 86 పత్త్రము లీతత్త్వసంగ్రహ రామాయణమునందలి బాలకాండము. పత్త్రము లటనటఁ గ్రిమిదష్టములైనను, ప్రతి మంచిస్థితిలో నున్నది. ఇదిగాక 230 సంఖ్యగల

ప్రతియును తత్త్వసంగ్రహరామాయణమే. ఆప్రతి తొలుతటి యిరువది పత్రములకు మొదటిభాగములు లోపించినది. అందు బాలకాండము మొదలుగ సుందరకాండము తుదివఱకును గలదు.

గ్రంథారంభము.

శ్లో. యోఽనంతే సర్గా దేక ఏవాస పశ్చా
దేకం సంతం బహుధా యం వదన్తి
య స్సర్వజ్ఞ స్సర్వగ శ్శాంత ఏక
స్తం రామాఖ్యం దేవమాద్యం భజేఽహం. ౧

యత్పాదం భువనైకధామ విలస ద్విశ్వస్య నాభ్యుత్థితం
తత్క్రీడాకమలం విధాయ విహరం త్యన్యే వరా మే హియా
శక్తిం తాం జగతాం క్రియాభి రనిశం సంక్రీడయన్తీం పరాం
సేవే తాం నిజలోకభాగ్యనివహాం సీతాభిధాం కా మహాం. ౨

గురుం వాణీం గణేశంచ నత్వా వ్యాసం శివం శివాం
వాల్మీకిం నారదాదీంశ్చ భజే రామకథావిదః
రామాయణే పురాణేషు సంహితా స్వాగమాదిషు
రామతత్త్వచరిత్రాద్యా విశేషా స్సన్తి భూరిశః. ౩
ఏకత్రైవ విశేషాం స్తా నవగాహితు మిచ్ఛతాం
యత్ర యే యే విశేషాస్స్యుః తాంస్తా న్సంగృహ్య సారతః
ప్రసిద్ధార్థస్య సంకోచై రప్రసిద్ధార్థవిస్తరైః
శ్రీరామతుష్ట్యై ప్రాచీనై ర్మణిభి ర్మాలికామివ. ౪

శ్లోకై ర్నానాపురాణాదినిష్ఠైరేవ సకల్పితైః
కుర్వే రామాయణం తత్త్వసంగ్రహాఖ్యం మనోరమం ౫

ఇట్లు ప్రతిజ్ఞ చేసి, ధర్మఖండము, శ్రీమద్రామాయణము, సంహితలు, అధ్యాత్మరామాయణము, కూర్మ, పాద్మ, నారసింహ, బ్రహ్మ, బ్రహ్మాండ, స్కాందపురాణములు, భాగవతము, విష్ణుపురాణము, రామ

తాపిని, హిరణ్యగర్భసంహిత, శ్రీరామమంత్రకల్పము మున్నగువాని నుండి విషయము నంతను కృత్స్నముగ సంగ్రహించి సమకూర్చినారు. పాఠకుల కొకయంశము నుదాహరించుచున్నాఁడను.

త్రయోదశసర్గ ప్రారంభము:—

పార్వత్యువాచ:—

కోవా దశరథః ప్రోక్తః కౌసల్యా కాఽను శంకర
భగవాన్కారణా ద్యస్మాత్తయో ర్జాతో వదస్వ తత్.

శివఉవాచ:—

స్వాయంభువో మనుః పూర్వం ద్వాదశార్ణం మహామనుం
జజాప వర్షసహస్రం నైమిశే గోమతీతటే
పూజిత స్తేన లక్ష్మీశః ప్రసన్నః కరుణానిధిః
మత్తో వరం వృణీష్వేతి తేనోక్తో మను రబ్రవీత్
పుత్త్రత్వం భజ దేవేశ త్రిషు జన్మసు మే హరే
త్వాం పుత్త్రలాలసత్వేన భజామి పురుషోత్తమ.

శ్రీభగవానువాచ:—

ఏవ మస్తు మనుశ్రేష్ఠ యత్తే మనసి కాంక్షితం
మమాపిచ మహాప్రీతి రాప్తుం తే పుత్త్రతామితి
స్థితి ప్రయోజనే కాలే తత్ర తత్ర జనిష్యసి
త్వయి జాతే త్వహమపి జనిష్యే తవ నన్దనః
రఘువంశే మనుఃపూర్వం జాతోదశరథ స్తతః
ద్వితీయే వసుదేవోఽభూ ద్వృష్ణీనా మన్వయేఽథసః
తృతీయేఽభూద్ద్విజః కశ్చిన్మను ర్విష్ణువతాహ్వయః
కలా దివ్యసహస్రాబ్దే గ్రామే శంబళసంజ్ఞికే
ఏవం జన్మత్రయం కృత్వా ముక్త స్స్యా దంత్యజన్మని.

ఈరీతిగ సంశయాంశముల సహేతుకముగ విమర్శించి తత్త్వమును గరతలామలకముగఁ జేయు నీరామాయణతత్త్వమును విజ్ఞులరసెదరు గాక

## మకరందధురి.

కురలి రామపండితునిచే రచింపఁబడినది. అప్పయదీక్షిత విరచిత మయిన కువలయానందమున కీగ్రంథము వ్యాఖ్యానరూపము. వైద్యనాథసూరి రచియించిన 'చంద్రిక'యను వ్యాఖ్యానమునకు ఖండనగ్రంథము. ఈపండితుఁ డగస్త్యగోత్రోద్భవుఁడును, ఆలంకారిక చూడామణియు,కవీంద్రుఁడు నని యాతఁడు రచియించిన యీటిప్పణీలహరుల తుది గద్యలవలనఁ దెలియుచున్నది. ఆవచనము లిట్లున్నవి.

ఇతి శ్రీమదగస్త్యగోత్రపవిత్ర కురలివంశమౌక్తికమణే రాలంకారికచూడామణే రామసంఖ్యావతః టిప్పణీషు కువలయానన్దటిప్పణ్యాం మకరందధుర్యాం ఉపమాదిశతార్థాలంకార వివరణం నామ ప్రథమా లహరీ.

ఇతి శ్రీమదగస్త్యగోత్రపవిత్ర కురలి వేంకటకృష్ణ పండిత రామ కవీంద్ర విరచితాయాం కువలయానందటిప్పణ్యాం రసవదాది పంచ దశాలంకారనిరూపణం నామ ద్వితీయా లహరీ.

ఇతి శ్రీమదగస్త్య గోత్రపవిత్ర కురలి వంశమౌక్తిక మణే రాలంకారిక చూడామణే............కువలయానందటిప్పణ్యాం మకరందధుర్యాం సంసృష్టినిరూపణం నామ తృతీయా లహరీ.

ఈపండితుఁడురచియించిన వేఱొక గ్రంథము 'దశరూపకవర్త్మ' గానగుచున్నది. ఈతనిపాండిత్యప్రతిభ గొప్పదని మకరందధురి చాటుచున్నది. తర్కజటిలమైన చంద్రికావ్యాఖ్యాన మవగతముచేసికొనుటయే దుస్సాధము. అట్టితెఱఁగు నావ్యాఖ్యానమందలి దోషముల నుద్ఘాటనచేసి ఖండింపఁబూనుట యీతని యాలంకారికశిఖామణిత్వమును వ్యక్తము సేయుచున్నది.

ఇది నీప్రతి 1146 సంఖ్యగలది. పత్రములు 115. వ్రాఁత బాగుగనున్నది. తప్పులులేవు. పత్రములు క్రిమిదష్టములు. ఒండురెండు పత్రములతుదలు తునిఁగినవి. వ్రాయసగానిపేరు తెలియరాదు. గ్రంథము సమగ్రము.

గ్రంథారంభము :—

శ్రీరస్తు.

శ్లో. అన్యోన్యాదర వీక్షణ విస్మృమర శృంగారసార సర్వస్వం
తేజఃపరం శివాఖ్యం చిర మవతా న్మాం పురాణదాంపత్యం.
వందిత్వా తన్మహ శ్చంద్రచూడ మానందమందిరం
కుర్వే కువలయానంద మకరందఝురీ మహం.
యద్య ప్యప్పయ సోమపీథికవిచంద్ర ... ... ... ...
కిమిహా స్తి మే కువలయానందే తథా ప్యాదరాత్
యత్నః కశ్చన కార్య ఏవ నను తం యద్వైద్యనాథోదితా
వ్యత్య స్తీకురుతే దురర్థకలనై ర్వ్యాఖ్యామిషా చ్చంద్రికా.

తథాహి.

చంద్రాలోకా త్కువలయానందో ఽభూదితి నాద్భుతః
పరం కువలయానందాచ్చం ... ... ... ... ... ...

శ్లో. అతఏవ చకార వైద్యనాథో నిజకృత్యాహ్వవిపర్యయప్రమాదం
పరిహర్తు ముదారయూలరీతే ర్బత మన్యే విపరీత లేఖనాని.
తాని స్పష్టీకరిష్యంతే తత్ర తత్ర విభావ్యచ
విమత్సరం సహృదయా మాం నింద న్త్వథ నందతు.

అనఁగా కువలయానంద వ్యాఖ్యాతయగు వైద్యనాథసూరి విపరీతముగ వ్యాఖ్యానమొనర్చినాఁడు, అతని వ్యత్యాసముల నటనటఁ దెల్పెదను. సహృదయులు మాత్సర్యమువదలి పరికించి నిందించెదరుగాక; లేక ఆనందించెదరుగాక యని ప్రతిజ్ఞ సలిపినాఁడు.

శ్లో. సామాన్యలక్షణాన్వితమేవ గ్రాహ్యం విశేషలక్ష్మ తతః
నక్వాత్యతి ... ... ... ... లక్ష్మకించి ద త్రకృతం.
కావ్యప్రకాశముఖలక్షణ పారదృశ్వా
కల్యాణనవ్యబహుకావ్యవిధానచంచుః
సాహిత్యసారనిధి రప్పయదీక్షితీయ
వ్యాఖ్యా మిమాం కురలి రామకవి ర్వ్యధత్తే.

ఈశ్లోక మీతఁడు, కవివతంసుఁడు సాహిత్యసారవేత్తయునని చాటుచున్నది. వ్యాఖ్యానరీతి దీనిని సమర్థించుచున్నది. 'చంద్రికా' ఖండన క్రమమును దెలుపుటకొఱక కొన్ని వాక్యముల నీమకరందర్శుని నుండి యుదాహరించుచున్నాఁడను.

"వస్తుతస్తు-'విశేష్యేణ సహైకార్థం భవేద్యత్ర విశేషణం
లింగసంఖ్యాదయః ప్రాయో విశేష్యస్థా విశేషణం."

ఇతికారికోక్తదిశా ఈశ్వరాదిపదానాం విశేషణవాచకత్వం వినా బుధాది పదసమానవిభక్తికత్వ... నావశ్యకత్వేన తదర్థమీశ్వరాది సదృశేలక్షణా. ఇవాది స్తాత్పర్యగ్రాహకః అస్యచబుధాదా వభేదాన్వయ ఇతిర మణీయః పంథాః. అత్రకుతర్క-కర్క-శారణ్యశరణ్య చంద్రికాకారోక్త దూషణానామయ ముద్ధారక్రమః. యదుక్తమివాదే ర్ద్యోతకత్వే ఉపమాయా... తత్వంభజ్యేతేతి తన్న. ఇవాదే ర్ద్యోతకత్వంవాభవతు వాచకత్వం. ఉభయథాపినసమీహితహానిః. యతస్తత్ర్పయోగే ఉపమాశ్రౌతీత్యేవ ఆలంకారికసమయః. కించశ్రౌతత్వం న శ్రుతశబ్దవాచ్యత్వం. తథాసతి "మన్యేశంకే ధ్రువం నూనంప్రాయ ఇత్యేవమాదిభిః. ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపి తాదృశః" ఇతికారిక యోత్ప్రేక్షా వ్యంజకత్వేన పరిగణితా ప్రయోగేఽపి తస్యావాచ్యత్వ దౌర్లభ్యేన సార్వత్రిక గమ్యత్వాపత్తిః" ఇత్యాది.

ఇట్టి యీవ్యాఖ్యాన మాలంకారికుల కత్యంతాదరణీయము.

## దశరూపకవర్తి.

కురలి రామకవి విరచితము. దశరూపకముల ప్రమేయమును సంక్షేపముగ నూటపది శ్లోకములందు వివరింపఁబడినది. ఈప్రతిసంఖ్య 4246. మూఁడు పత్రములలో నీగ్రంథ మిముడినది. ఈపత్రములు క్రిమిదష్టములు. ఈప్రతియందు సిద్ధాంతకౌముదిలోఁ గొంతభాగము, లంబోదరప్రహసనము, ఉత్తరరాఘవము ను వ్రాయఁబడినవి. మకరందర్శురీ

కర్తయే దీనిని రచయించుటచేతను, రూపకలక్షణ గ్రంథములలో నూతనముగుటచేతను నిటఁదెలుపఁ బ్రసక్తికలిగినది.

గ్రంథారంభము.

శ్లో. అ...వ...గుణవారిధి మాన మ్యాత్మని సదాశివం దేవం
వ్యుత్పిత్సుముదే కథయతి దశరూపకవర్త్మ కురలి రామకవిః,
యద్యపి పూర్వై ర్వేత ద్వివృతం దశరూపకాదిషు తథాపి
వ్యుత్పిత్సూనా మస్మిన్ సుగమాయ పరం మమారంభః
సర్వైఃప్రతి...యస్యైఃస్యై రభినయై స్స్ఫుటం
సభా... నేతృచారిత్రరూపణా ద్రూపకం మతం.

తుదిభాగము :—

సంహారస్స్యా త్ప్రశస్తిస్తు సభాశంసన మీరితం
దశోత్తరశతశ్లోకై ర్దాశరూపకపద్ధతిః
దర్శితా సాధు కురలి కులక్షీరాంబుధీందునా
రామసంఖ్యావతా త్వర్థం ప్రీయతాం శంకరోఽనయా

రూపకక్రమము.

శ్రీరంగభూపాలవిరచితము. దశరూపకములకు లక్షణము దెలుపఁబడినది. రచయిత శ్రీరంగభూపాలుఁడు. తొలుత రూపకములయందుపయోగించు పరిభాషనునిరూపించి, ఆవెనుక నాటకాదిలక్షణములను దెలిపినాఁడు.

తుదిశ్లోకము.

ఇత్థంశ్రీరంగభూపేన లక్ష్యలక్షణశాలినా
సర్వలక్షణసంపూర్ణం లక్షితో రూపకక్రమః.

గద్య :—ఇతి శ్రీరంగభూపాలీయే నాటకాదిదశరూపకాణాం లక్షణం సంపూర్ణమ్.

దశరూపకాదులయందు నిరూపింపఁబడని కొన్నిలక్షణవిశేషముల నిందుఁగూర్చియున్నాఁడు. ఈతని కీరూపకలక్షణ నిరూపణమునఁ

బ్రతిభావిశేషము గానవచ్చుచున్నది. ఏయేప్రకృతులం దెట్టి సంభాషణ ముచితమో యాయంశములను బాగుగవ్యక్తీకరించియున్నాఁడు. ఈప్రతిని 13 పత్రములుగలవు. వ్రాఁతమంచిది. పుటకాఱుపంక్తులు వ్రాయఁబడినవి. వ్రాఁతతీరు ముద్దులు గుల్కుచున్నది.

గ్రంథారంభము :—

అథ రూపకనిర్మాణ పరిజ్ఞానోపయోగినీ
శ్రీరంగధరణీశేన పరిభాషా నిరూప్యతే
తత్ర భాషా ద్విధా భాషా విభాషా చేతి భేదతః
చతుర్దశ విభాషాస్స్యుః ప్రాచ్యాద్యా వాక్యవృత్తయః
ఆసాం సంస్కారరాహిత్యా ద్వివిధో నో న కథ్యతే
ఉత్తమాదిషు తద్దేశవ్యవహారా త్ప్రతీయతాం
భాషా ద్వివిధా సంస్కృతాచ ప్రాకృతా చేతిభేదతః.
కౌమారపాణినీయాదిసంస్కృతా సంస్కృతా మతా ఇత్యాది.

నకుమ నొకఘట్టము :—

కథానాథాస్తు ధర్మార్థరసమోక్షోపయోగినః
ధర్మోపయోగినస్తత్ర యుధిష్ఠిర నళాదయనః,
అర్థోపయోగినస్తత్రనరసింహన్నృపాదయః
రసోపయోగినోవిద్యాధరవత్సేశ్వరాదయః
మోక్షోపయోగినో రామవాసుదేవాదయో మతాః.
కవయ స్తత్ప్రబంధార స్తే భవేయు శ్చతుర్విధాః
ఉదాత్త ఉద్ధతః ప్రౌఢో వినీత ఇతి భేదతః
అంతర్గూఢాభిమానోక్తి రుదాత్త ఇతి గీయతే
పరాపవాదా త్స్వోత్కర్ష వాదితోద్ధత ఉచ్యతే
యత్రో జితనిజోత్కర్షవాదీ ప్రౌఢ ఇతీరితః

యుక్త్యా నిజోత్కర్షవాదీ ప్రౌఢ ఇత్యపరై స్స్మృతః
వినత్తో వినయోత్కర్షా త్స్వాపకర్షప్రకాశకః.

## అలంకారశిరోభూషణము.

ఇదియొక సంస్కృతాలంకారశాస్త్రగ్రంథము. అయ్యలూరి కందాళార్యవిరచితము. ఈకవిదేశకాల చరిత్రాదికము కృత్యాదినిఁదెలుపఁబడినది. ఆవిషయమును క్రమముగ నుదాహరించెదను. ఉపలబ్ధమయిన యీప్రతియందు 11 పత్రములు ప్రథమోల్లాసమును, 12 పత్రములు ద్వితీయోల్లాసమును, 14 పత్రములు చతుర్థోల్లాసమును, 8 పత్రములు పంచమోల్లాసమును, 5 పత్రములు షష్ఠోల్లాసమును, 5 పత్రములు సప్తమోల్లాసమును గలవు. ప్రథమమున కృతిపతిపతివర్ణనము అక్షరగణాది వివేకమును, ద్వితీయమున కావ్యలక్షణము, చతుర్థమున రసనిరూపణమును, పంచమమున దోషములు, షష్ఠమున గుణములు, సప్తమమున శబ్దాలంకారములును నిందలి ప్రమేయము. దృశ్యకావ్యవివేచనముగల తృతీయోల్లాసము, అర్థాలంకారస్వరూపమునుదెల్పు అష్టమోల్లాసమును నిందు లుప్తములు. ప్రతిసంఖ్య 3441.

ఈతని యుల్లాసాంతగద్య:—

ఇతి శ్రీమత్సకలకల్యాణ గుణగణపరిపూర్ణ కృష్ణా తుంగభద్రామధ్యాధిష్ఠిత శ్రీబోరువెల్లినగర విహరమాణ శ్రీ కేశవస్వామి చరణనలినయుగల సేవాధురీణతాభిరామ సోమభూపతి సతీలలామ గిర్యమ్మాంబాగర్భ క్షీరపాథోనిధి సుధాకరాయమాణ శ్రీ వేంకటామ్మాభృన్మహాస్థాన విద్వన్మహాకవినా కౌశికగోత్రతిలకేన శ్రీమదాయ్యలూర్యన్వయ సముద్భవేన కందాళయార్యేణ విరచితే అలంకారశిరోభూషణనామ న్యలంకార శాస్త్రే ప్రథమోవిలాసః.

ఈకవివితంసుని యలంకారశాస్త్రపాండిత్యము మంచిదిగానే కానఁగును. ఇతరశాస్త్రప్రమేయమును నీతనికి గోచరముయినట్లు లితని

రచన దెలుపుచున్నది. ఉదాహరణమునకై కొన్ని వాక్యములఁ జూపెదను.

శ్లో. శబ్దార్థౌ నిర్దోషౌ కావ్యం సగుణావలం క్రియావంతౌ” దోషరహితం గుణాలంకారవంతౌ శబ్దార్థౌ కావ్యమితి కావ్యసామాన్యలక్షణం. “నచ‘యః కౌమారహరస్సఏవహివరస్తా ఏవచైత్రక్షపాః”... ’ఇత్యాదావవ్యాప్తిః. అలంకారశబ్దేన అలంకారాత్యంతానధికరణత్వస్య వివక్షితత్వాత్ అత్రాలంకారస్యాస్ఫుటత్వేఽపితత్సం భావనాయాస్సత్త్వాత్. నహ్యాస్ఫుటత్వమాత్రేణాభావ ఆపాద్యతే. తస్మాద్యథా కథంచిత్సాలంకారస్యైవ కావ్యత్వమితిసిద్ధం. ననుకావ్యప్రకాశికాయాం, ‘తదదోషౌశబ్దార్థౌ సగుణావనలంకృతీపునః క్వాపి’. తిక్వచిదనలంకారస్యాపికావ్యత్వముక్తం,అతోవిరోధ ఇతిచేన్నైవం. అనలంకృతీ ఇత్యత్ర అనుదరా కన్యేత్యాదావివ ఈషదర్థకత్వస్య వివక్షితతయా ఉక్తార్థలాభాత్ - నచ నఞః ఈషదర్థకత్వమప్రామాణికమితివాచ్యం. ‘తత్సాదృశ్యమభావశ్చతదన్యత్వం తదల్పతా. అప్రాశస్త్యంవిరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః”

ఇతి వచనస్యైవ ప్రమాణత్వాత్ :—

లక్షణములను లక్ష్యములను స్వయముగ రచియించియున్నాఁడు. రంగేశునకంకితముఁజేసినశ్లోకములనుదాహృతులకుఁగైకొనియున్నాఁడు. కవితాధారయు సరసముగనే యున్నది.

తెలుఁగు ప్రబంధములయందలి కృత్యాదిపద్యముల తీరెట్లుండునో యీయలంకారగ్రంథమునందలి యుపక్రమ మట్లేయున్నది. విస్తృతమైనను పాఠకులకీక్రమమును దెలియఁజేయఁ గుతూహలినై ప్రదర్శించుచున్నాఁడను. ఈప్రసంగమునఁ గృతికర్తృ కృతిభర్తలనుఁ గూర్చి కృత్స్నముగఁ దెలియఁగలదు.

కృత్యాది :—

శ్లో. కందాళ దొడ్డయాచార్యచరణౌ శరణం వృణే
యన్నతౌ కవితాగంగాలహరీ విహరిష్యతి.
అతిశయోఽస్తి మంహాంశ్చమహాగురో
శ్చరణయో రనయో స్సరసీరుహాత్
భవతి తత్స్వయమేవ గృహంశ్రియః
పరమి...తనుత స్స్వసమాశ్రితాన్.
సకలజనాంతర్యామీ సదృశవయోరూపగోపికాగామీ
కలయతు కమలాకామీ కరుణాం మయి భూరి కేశవస్వామీ.
జయతి కిల కులం తజ్జన్మ యస్యావిరాసీ
త్పరమపురుషపాదే బ్రహ్మరుద్రాదిపూజ్యే
సురమునిగణసేవ్యా సోదరీ యస్య గంగా
క్షితిరపి సుపవిత్రా క్షేముదా ప్రాణభాజాం.
తస్మి న్నాకృష్టవలం వర్ణం సువర్ణమివ శుశ్రుమ
వర్ణోత్కృష్టశ్చ కుత్రాపి పాకాతిశయతః పరం.
దేశోఽపి పాకనాడీతి విఖ్యాతో లోకపుణ్యపరిపాకాత్
తత్ర మిటిమిళ్లగోత్రం ప్రాప్తమభూ ద్భూరిగోత్రరాజత్వం.
తస్య మిటిమిళ్లగోత్రస్య మహిమా వాగగోచరః
యత్ర శ్రీవేంకటకృష్ణ ప్రముఖా జాతా మహీంభృతః.
దేవాభూపలయే జనాచనిరతాః పుణ్యైరగణ్యైస్స్థితాం
కర్తుం స్వస్వపదస్థితిం విధి ముపేత్యాభ్యర్థయన్ స్వాన్స్వయం
తత్సంగృహ్యాకు - సోపి సకలం సారం యతో ముష్టినా
యద్వంశం వ్యతనో త్స భాతి నితరాం తన్ముష్టిపల్ల్యాఖ్యయా
ఇత్యాది.

తన్ముష్టిపల్లివంశే జాతా ముక్తామయాశ్చ రాజానః
వేంకటనాయకమణినా గుణినా హృదయంగమా బభు స్సుదృశాం
మాణిక్య స్తంభశుంభద్ఘనకనకమహాభి త్తిసంప త్తిదీవ్యత్
గేహవ్యూహాంతరాళా విరళసదయితాశ్లేష మోహాస్తి తేషాం
భాస్వచ్ఛ్రీచారువేల్లీ భువికవివిదుషాం భాగ్యదా కల్పవల్లీ
రాజ్ఞాం శ్రీముష్టిపల్లీకులజలధి భువాం రాజధానీమతల్లీ.
నడిగడ్డసీమనామా దేశః ఖలుభాతి తేన నగరేణ
మధ్యస్థత్వాత్ పుణ్యో య స్త త్కృష్ణాతుంగభద్రయోశ్శ్రేష్ఠః

పట్టణవర్ణనము ... ... ... ... ... ... ...

లక్ష్మీకుచాంబురుహకుట్మలకుంకుమాంక
వక్షస్థలోల్లసితకౌస్తుభకాంతిపూర్ణః
యద్భోరువల్లి నగరీనిలయో దయాళుః
శ్రీకేశవో జయతి దైవతసార్వభౌమః.
తచ్ఛ్రేవయా ప్రతిదినం పరివర్ధమాన
సామ్రాజ్యవైభవజుషామనినీయశౌర్యాః
శ్రీముష్టిపల్లికులవారిధిపూర్ణచంద్రా
భూపాలకాశ్చ బహవో నితరాం బభూవుః.
నల్లారెడ్డీతివిఖ్యాత స్తేషురాజ స్వభోభవత్
యత్కీర్తిపూరకర్పూర పూరితాజాండపేటికా
గుణరత్నాకరా త్తస్మాజ్జాతౌ సోమాచ సత్ప్రభూ
సర్వజ్ఞశేఖరా సర్వకళాపూర్ణా ద్విజాధిపా.

... ... ... ... ... ... ... ... ... ... ... ...

తౌ సోమౌ విష్ణ్వంశౌ లక్ష్మీర్గిరిజాచ యత్తయోః పత్న్యౌ
సుకుమారో వెంకటరా డన్వర్థో యత్తయోః పుత్రః.
ఆర్యా సతీశివాఖ్యా బుధవంద్యా సర్వమంగళా నిత్యం
గిరిజేవ జయతి భూమౌ సాక్షాద్గిరియమ్మనామధేయన.

ఘనఇవజీవనదాయీ విధురివ సన్మార్గవర్తనే నిరతః
సురతరురివ సుమనోభిః పరికలితో భాతి వేంకటక్ష్మాభృత్
స ఏకదా వేంకటభూమిపాలక స్సభాసదాంమధ్యగతః కళారతః
సుధామయై స్సూక్తిఝురైః ప్రమోదయన్
ప్రశంసమాయాస కవీన్ సమాదరాత్.
సత్యం పుత్రీ సప్తసంతానభాజాం రాజ్ఞా మధ్యేసత్కృతిర్య స్సఏవ
రామాదీనాంకాప్యస్తిసంతానషట్కంనిత్యం-వ్యంత్యస్తిరామాయణాదిః
కావ్యమేవ పరం పుంసాం విలక్షణవిభూషణం
యదేకదైవ బహుభిర్ధార్య...సదనశ్వరం.
తాదృగ్బహువిధగ్రంథగ్రథనాత్తమహాయశః
కందాళయార్య భవతా కర్తవ్యం కావ్య ముత్తమం.
కర్తుఃకారయిత్రస్థైవని తరామధ్యాపకాధ్యాయినాం
శ్రీరంగేశ పదోదయా యదిభవే త్త్వద్వాగ్ధునీ సర్వతః
గంగేవేయ మభీష్ట దాయశమనీ లోకేభవ త్వాదరా
దేనాంయే శిరసా వహంతి విబుధా స్తేయాంతి సర్వజ్ఞతాం.
ఏవం సంప్రార్థిత స్తేన రాజ్ఞా సభ్యై రనూదితః
కరోమి సదలంకార శిరోభూషణముత్తమం.
శ్రీరంగధామ్ని భవనే భుజగే శయాన
శ్శ్రీమో హరి ర్దిశతు న స్సజగన్నివాసః
శ్రీ రంగనా సతత మంబు ఖగేశయానః
సూనుశ్చ యేన నిహితో హృది నాభికంజే.

---

# రాయలరచ్చ.

విద్వాన్. పాలెపు వేంకటరత్నం.

సీ. తెలుఁగుదేశపుఁ గట్టములఁ బాపసమకట్టి
కౌశేయకముఁదాల్చు కర్మయోగి
తెలుఁగు బాసనుగల్గు తీయందనము లోక
మునఁ బంచిపెట్టిన పుణ్యమూర్తి
తెలుఁగమ్మకడకంట నొలుకు కన్నీటి కా
లువ నడ్డుగట్టిన కవివరుండు
తెలుఁగుకైసరుల నుజ్జ్వల రత్నపల్యంకి
కలనుంచి మోచిన యలఘుయశుఁడు
పలుకుపలుకునఁ దేనియలొలుకఁ జేయు
కవిత జాల్వాఱఁజేయు దిగ్దంతులెలమి
హాటకాసనములఁ గొల్వుకూటమునను
దనుఁగొలువ కృష్ణరాయ భూతలవిభుండు. ౧

ఉ. కాయము తప్తకాంచనసఖంబయి కాంతుల నీనుచుండఁ గా
శ్శేయకమొందు పార్శ్వమునఁ జిత్రతటిద్ద్యుతులన్ వెలార్ప, ర
త్నాయతనంబునం గొలుచునట్టి సువర్ణమయాసనంబునన్
హాయిగఁ గొల్వుదీర్చె నదిరా యని మెచ్చఁగ నెల్లవారలున్. ౨

ఉ. క్రొన్ననవంటి మేను దళుకుం గనుదమ్ములలోని కాంతియున్
దిన్నని రూపసంపద, వినిర్మలభావసమన్వితంబులౌ
యన్నువ పల్కులున్, మధురహాసముగల్గు నతం డెవండు? పె
ద్దన్నకవీంద్రుఁడా? నతులు ధన్యమతీ భవదీయవాణికిన్. ౩

మ వరణాతీరనివాసి విప్రవరునిన్, వామాక్షి నాధారుణీ
ధరమందున్ దగ నిల్పి ప్రేమకథ నుద్యన్మాధురీయుక్త సు
స్వరయుక్తిన్ నడిపించినాఁడవు నభస్వచ్చంద్రతారావధిన్
పరగున్నీదు యశస్సు పెద్దనకవీ, వాగ్దేవతాసత్కృపన్. ౪

ఉ. వారెవరోయి? సాలు వలెవాటుగఁ దాలిచి ఠీవిగూరుచు
న్నారు? మనోజ్ఞకావ్యరచనాచణులట్టులఁదోచు; రాచదే
వేరికిఁ దోడువచ్చిన కవిప్రవరుల్గద! నందివంశ్యులా
కూరిమితోడ నానతులఁ గొమ్మిక తిమ్మకవీ! రయమ్మునన్. ౫

చ. మునిఁ గొనివచ్చు పుష్పమును ముట్టుట కిచ్చితె భోజకన్యయం
చును గడకన్ను లత్యధికశోణరుచుల్ గొనఁ గోపగేహమం
దు నిలుచు సత్యరూపు మదిఁ దోఁచఁగఁ గావ్యమునందు వ్రాసి భూ
పుని మదికోపము న్నడఁపి ప్రోచితి రాణిని నీవె సత్కవీ! ౬

చ. అతులితమాధురీరసమంచితకావ్యధునీప్రకల్పనన్
స్తుతమతివైన యాకవిబుధుం డతఁ డీతఁడ యేమొ చెప్పుమా!
యతిశయభక్తియుక్తిఁ ద్రిపురాంతకపాదసరోజినీసమా
శ్రితమతి! ధూర్జటీ! కొను మివే ప్రణతుల్ భవదుజ్జ్వలోక్తికిన్. ౭

ఉ. నెయ్యముతోడ రాజుకడ నిశ్చలతన్ సుఖవృత్తినున్న యా
యయ్యయెవండు? బుద్ధి నహహా! యనిమెచ్చఁగ వచ్చువాఁడు, రా
మయ్యచరిత్రఁ గావ్యముగ నల్లి సెబాసని పేరుఁగొన్న యా
యయ్యలరాజువంశజుఁడ? అందుము నానతి రామభద్రుఁడా! ౮

ఉ. నాలుగురత్నపీఠికల నవ్యమనోహర వేషులైన ధీ
శాలురు పొల్తురెవ్వరు?-యశఃపరిపూరితదిగ్దిగంతులై
వాలినవారు సత్కవు లవారితమంజులకావ్యరత్నపాం
చాలికలన్ సృజించిన విశాలహృదంతరులా? నమస్కృతుల్. ౯

సీ. విష్ణుచిత్తీయ మాధ్వీస్వాదనాయత్త
బంభరాళికి బిసప్రసవ మెవఁడు
మనుసంభవాఖ్యసమ్యక్కావ్య నిర్మాణ
కారణుండగు మహాఘను డెవండు
పారిజాతాపహప్రౌఢప్రబంధక
ల్పనకు నాయకుఁడయి బరఁగె నెవఁడు
కాళహస్తినగాగ్రకలితశంభుమహత్త్వ
సత్కావ్యకర్తను సాఁకె నెవఁడు
ఆమహాశీరనారాయణాఖ్యఁ దనరు
మూరురాయరగండఁడు, భూరివిభవ
రాశియై యొప్పు రాయలరచ్చఁ బొగడు
భాగ్యమబ్బుట నాపుణ్యఫలముకాదె? ౧౦

# ముష్టాముష్టి.

## కిడాంబి రాఘవాచార్యులు ఎమ్. ఏ. బి. ఎల్.

ఈసమాస సాధుత్వమును గూర్చియు భారతహరవిలాస కాశీఖండాదులందుగల ప్రయోగములను గూర్చియు నాంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం. 26. పు 256-9 చర్చింపబడినది. ప్రస్తావవశమున బాహాబాహీత్యాదులను గూర్చియు వ్రాసియుంటిని. అందు బాహాబాహియను నది యుకారాంత పుంలింగ బాహుశబ్దమును గైకొనక యాకారాంత స్త్రీలింగ బాహాశబ్దమువలన నిష్పన్నమగుటను శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిలుగారు నిరూపించి యున్నారు. (పు 257) అది సమంజసమే. నిఘంటుకారులు బాహాబాహియను దానిని జూపక బాహాబాహవి (హూ) మాత్రమే తమ నిఘంటువుల నిచ్చియున్నారు. బాహాబాహవినిం గూర్చి వారు వ్రాసినదిట్లున్నది.

(1) శబ్దకల్పద్రుమము.

బాహాబాహవి-బాహుభి ర్బాహుభిః ప్రవృత్తం యద్ యుద్ధం తత్, ఇతి ముగ్ధబోధ వ్యాకరణమ్.

(2) వాచస్పత్యము.

బాహా(హూ)బాహవి-అవ్య-బాహుభ్యాం బాహుభ్యాం ప్రహృత్య ప్రవృత్తం యుద్ధం-ఇచ్ సమా-పూర్వపదేఆత్, దీర్ఘో వా-బాహుభ్యాం భాహుభ్యాం ప్రహృత్య యుద్ధే. (వాచస్పత్యము.)

(3) బాహా-The arm......(Comp)- బాహవి (ind) hand in hand, arm against arm Cp బాహూబాహవి (Apte)

(4) బాహా (F) The arm-(Comp)- బాహవి (ind) hand to hand-arm against arm Cp బాహూబాహవి (Vaidya)

ఇట్లు నిఘంటుకారులు గైకొన్న బాహాబాహవియనునది ముష్టాముష్టివలెనే సాధింపదగియున్నది; కాని ఆకారాంత స్త్రీలింగశబ్దముచే సాధింపవలనుపడదు. వీరందఱును బాహాశబ్దముక్రింద బాహాబాహవిని మాత్రమే కనబఱచి బాహాబాహిని జూపకపోవుటకుఁ గారణ మూహ్య

మైయున్నది. అమరమున 'భుజబాహూ ప్రవేష్టో దోః స్యాత్ 'అని బాహు శబ్దమును మాత్ర ముదాహరించినను వ్యాఖ్యాతలు ఆకారాంత స్త్రీ లింగముకూడ గలదనియు 'బాహాదోషో ప్రవేష్టా శ్చేతిమంజరీ యనియుఁ దెలిపియున్నారు. సంస్కృతవాఙ్మయమున బాహాబాహవి యనుదానికిఁ బ్రయోగములు లభించునేమో మనము వెదకవలసి యున్నది.

కన్నడమునఁ బ్రాచీనలక్షణగ్రంథమగు శబ్దమణిదర్పణమున ముష్టాముష్టి ప్రశంసగలదు. అందు ముష్టీముష్టి నుదహరించినటులఁగనఁబడదు. దాని నిటఁ జూపుదును.

సూ. ఇతరేతర క్రియా సం
హతమను తానావుదల్లి మత్తె బహుప్రీ
హి తగల్గు మాత్వవిధి సం
గతమాది పదాంత్యదల్లి చరమక్కిత్వం. (185)

ప్రయోగం. ఖడ్గదిం ఖడ్గదిం మాడువ యుద్ధమావుదదు-ఖడ్గాఖడ్గి.

ముష్టియుం ముష్టియుం మైయొడ్డి మాడువ యుద్ధమావుదదు ముష్టాముష్టి, ముట్టాముట్టి హెల్లాహెల్లి - దాటూదాటి - దెక్షాదెక్షి - (హాణాహాణి) హాణాహాణి-ఘట్టాఘట్టి-మల్లామల్లి-ఇవు తత్సమంగళ్ ... ...(నంజయ విరచితమగు టీకతోఁ బ్రకటితమైన గ్రంథము) పు. 158

మదరాసు యూనివర్సిటీవారు లింగనారాధ్యుని వృత్తితోఁ బ్రకటించిన గ్రంథమునఁగూడ (పు. 159). సూత్రానంతరమిట్లు కలదు.

ప్రయోగం. ఖడ్గదింఖడ్గదిం మాళ్పయుద్ధం ఖడ్గాఖడ్గి, ముష్టియుం ముష్టియుం మాళ్పయుద్ధం ముష్టాముష్టి-హల్లాహల్లి-దాటాదాటి-దెక్షాదెక్షి-హాణాహాణి-(హాణాహాణి ?) మల్లామల్లి ...(ముష్టాముష్టికి తద్భవముగ ముట్టాముట్టి గ్రహింపఁబడినది.)

ఈగ్రంథమునుబట్టి కన్నడలాక్షణికులు ముష్టీముష్టి నంగీకరించినట్లు కనఁబడదు. కన్నడ నిఘంటుకారుఁడగు Kittel కూడ దానిని గైకొని యుండలేదు. ఒకవేళ కన్నడసంప్రదాయమునే యాంధ్రులును గైకొని యుందురా? ముష్టీముష్టికన్న ముష్టాముష్టియే శ్రుతికి హితముగ నుండుటయే దీనికిఁ గారణమని తోఁచుచున్నది.

# గ్రంథస్వీకారము.

(1) శ్రీరామకృష్ణవాక్యావళి. (2) శ్రీరామకృష్ణ పరమహంస జీవితోపదేశ సంగ్రహము. (3) శ్రీరామకృష్ణ పరమహంస నీతికథారత్నములు.

ఈమూఁడు గ్రంథములును మదరాసు శ్రీరామకృష్ణమఠము నుండి శ్రీమాధవచైతన్య బ్రహ్మచారిగారిచేఁ బ్రకటింపఁబడినవి. ఇందు ఆంగ్లభాషయందు Sayings of Sri Rama Krishna అను గ్రంథమునకు మొదటిది యనువాదము. మూలమునఁ బునరుక్తములగు నుపదేశములు తొలగింపఁబడి, నూతనముగ మఱికొన్ని చేర్పఁబడినవి. పెక్కు మూలగ్రంథములనుండి సంగ్రహింపఁబడిన నీతికథారత్నములు చతుర్థఖండముగఁ జేర్పఁబడినవి. జగద్విఖ్యాతయశస్కుఁడగు శ్రీరామకృష్ణపరమహంస, శ్రీవివేకానందస్వాముల యుపన్యాసములు, సూక్తులు, తేటతెనుఁగుభాషలో సర్వజనోపయోగముగ నాంధ్రీకరించి ప్రకటించిన శ్రీరామకృష్ణమఠమువారి భాషాసేవను మనము బాగుగఁ బ్రశంసింపవలసియున్నది. ఇట్టి గ్రంథములు మనదేశమున దేశభాషలలో వ్యాపకముఁ జెందినచో హిందూమతము పునరుద్ధరింపఁబడుననుట కిసుమంతయు సందియము లేదు. శ్రీరామకృష్ణుల యుపదేశరత్నములఁ బ్రకటించుటలో ననువాదకులు నూతనమార్గమును ద్రొక్కియున్నారు. పెక్కు శీర్షికలక్రింద విభజింపఁబడి పరమహంస యుపన్యాసముల సారాంశమును సులభముగ గ్రహింప వీలుగనున్నది. మఱియు శ్రీరామకృష్ణుని జీవితమును, ఉపన్యాసముల సారాంశమును దెలుపు విపులమగు పీఠికయుఁ గలదు. ఉపదేశ వాక్యముల ప్రామాణ్యతను దెలుపు భగవద్గీత, ఉపనిషత్తులు మొదలగువానినుండి ప్రమాణవాక్యములు చేర్పఁబడినవి. శ్రీరామకృష్ణుల యుపదేశములు చిన్నకథలతోఁగూడి చదువుటకు మనో

జ్ఞముగనుండుటయేగాక వేదాంతవిషయములను సులభముగ గ్రహింప సహకారిగనుండును. శ్రీమాధవచైతన్యుల యనువాదమును సులభమగు శైలిని రచింపఁబడి హృద్యమై యొప్పుచున్నది. శ్రీరామకృష్ణ వాక్యావళిలోని పీఠికయు, నీతికథారత్నములును వేఱుగ ముద్రింపఁబడి 2, 3 గ్రంథములుగ వెలువడినవి.

(4) అభినవచికిత్సారత్నాకరము. (5) ఆంధ్రశారీరశాస్త్రము. (6) కాయశోధనవిధానమగు పంచకర్మచికిత్స.

గ్రంథకర్తలు వైద్యరాజ పాలంకి సూర్యనారాయణకవిగారు. గ్రంథకర్తలును ప్రసిద్ధవైద్యకుటుంబమునకుఁ జెందినవారు. వైద్యవిషయములను గూర్చి సులభమగు పద్యములతో నీ గ్రంథముల రచించుట వీరికి, వైద్యశాస్త్రమునందేగాక యాంధ్రభాషయందును గలయభిమానమును వ్యక్తీకరించుచున్నది. మొదటి గ్రంథమునకు కీ. శే. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సహజమగు ప్రహసనరీతిని పీఠికను రచించియున్నారు. వారు వైద్యులెన్నివిధములుగ నుందురో, వారి పాండిత్యములు, హిక్మత్ వైద్యములు మొదలగు వానిని గూర్చి పెక్కువిషయములు వ్రాసియున్నారు. ప్రస్తావవశమున నేఁటి వైద్యకుటుంబములు, అందలి ముఖ్యవైద్యులను గూర్చియుఁ జాలవిశేషములను దెలిపియున్నారు. శ్రీసూర్యనారాయణకవిగారు తమయనుభవములను గూర్చి రాజమహేంద్రనగరమున నుపన్యసింపఁ దమమిత్రులు గ్రంథరచనకుఁ బ్రోత్సహించుటచే దీనిని రచించితిమని వ్రాసిరి. శాస్త్రగ్రంథములు పద్యరూపమున నున్నచో వాని ప్రాశస్త్యము చెడునని మన మూహింపరాదు. పూర్వగ్రంథములన్నియు శ్లోకరూపమున నుండుట మనకు విదితమే. సులభగ్రాహ్యముగనున్నచోఁ బద్యములైనను శాస్త్రవిషయములను నిర్మలముగ వివరింపఁగలవు. మొదటిగ్రంథమున వేర్వేఱు రోగములు, వానికి కారణములు, రోగనిదానము, పథ్యాపథ్యములు, చికిత్సలును విపులముగఁ దెలుపఁబడినవి. పీఠికలో శ్రీ నరసింహారావుగారు దెలిపినటుల

విచిత్రములగు ప్రయోగములు దెలుపఁబడుటచే నీగ్రంథము అభినవచికిత్సారత్నాకరమనఁబడినది. రెండవది శారీరశాస్త్రము, ఇందు గర్భోత్పత్తి, శారీరనిర్మాణము, శారీరవిభాగము మున్నగు ప్రకరణములు గలవు, ఈగ్రంథమునకుసూర్యనారాయణీయమను నామాంతరముగలదు. వైద్యశాస్త్రమభ్యసింపఁగోరువారు శరీరశాస్త్రము నామూలాగ్రముగఁ బఠింపనియెడల వారిప్రయత్నము నిష్ఫలమగును. చికిత్సావిధానము పూర్తిగ నీశాస్త్రముపై నాధారపడియున్నది పెక్కుగ్రంథములఁ బ్రస్తావవశమున వర్ణింపఁబడిన శారీరశాస్త్రవిషయముల నొకచోఁ గూర్చి వైద్యుల కుపయుక్తమగురీతిని గ్రంథకర్త లీగ్రంథమును రచించియున్నారు. మూఁడవ గ్రంథమున స్నేహ, స్వేద, వమన, రేచన, వస్తికర్మలాచరించు విధానములు వివరింపఁ బడినవి. శ్రీసూర్యనారాయణకవిగారీగ్రంథములఁ గేవలము వైద్యులకేగాక సాధారణజనులకుఁగూడ నుపయుక్తమగునట్లు రచించియున్నారు. అందఱును వీనిం జదివి గుణమును గ్రహింతురుగాక.

(7) అపనిందాపహరణము- ఈపద్యకావ్యము పైనఁదెలుపఁబడిన శ్రీపాలంకి సూర్యనారాయణకవిగారిచే రచింపఁబడినది. ఇందు వినాయకవ్రతకల్పము, అపనిందాపహరణ మను నైదాశ్వాసముల పద్యకావ్యమునుగలవు. కథయుఁబ్రసిద్ధమైన, వినాయకుని వృత్తాంతము. శైలి సులభమై మృదువుగనున్నది. మచ్చున కొకపద్యము.

ఉ. చారుసితాబ్జకుందనవ శారద నీరద తారహీరనీ
హారమరాళరాజ రజతాచల హాస సమప్రభాంగుఁ డా
నారదమౌని దివ్యమునినాథుని గృష్ణుఁ గనంగ నయ్యెడన్
ద్వారక కేఁగుదెంచె బుధవర్గము తన్నుతియించుచుండఁగన్.

(8) కొండపల్లిచరిత్రము—శ్రీబుద్ధిరాజు హనుమంతరావు, దేవరాజు సూర్యనారాయణరావు కవిసోదరులచే రచింపఁబడినది. కొండపల్లిఖిల్లా చరిత్రమును దెలియఁగోరువారి యుపయోగమునకై కవిసోదరులీ వచనగ్రంథమును రచించిరి. ప్రథమమున నింపుఁ గొండవీటి

రాష్ట్రమునఁగల దుర్గములును గ్రామాదులును వివరింపఁబడినవి. కొండపల్లిదుర్గ నిర్మాణమాదిగ రెడ్డిరాజులు, విజయనగర రాజుల దండయాత్రలు మూలగ్రంథముల సహాయమున సూక్ష్మముగఁ దెలుపఁబడినవి. గ్రంథ మిరువదియారు పుటలయినను బెక్కువిషయములు వర్ణితములు. ఈగ్రంథము గణపవరమునందలి ప్రేమలతాగ్రంథమండలిచేఁ బ్రకటిత మయిన నాల్గవ కుసుమము.

9. ఆంధ్రప్రతిభ—ప్రభాకర లక్ష్మీనరసింహకవులచే రచింపఁబడిన ఖండకావ్యసంపుటమునఁ బ్రథమభాగము. ఇందు ఆంధ్రోద్యమము, ఆంధ్రవిష్ణువు, నన్నయాది ప్రాచీనాంధ్రకవులు, అధునాతనకవులు, పండితులు, రాజకీయవేత్తలు మొదలగువానినిఁగూర్చి ప్రశంసాపద్యములు సమకూర్పఁబడి యాంధ్రప్రతిభ యనుపేరఁ బ్రకటింపఁబడినది. గ్రంథకర్తలకుఁ గల యాంధ్రాభిమానము ప్రశంసనీయము. ఇందలి పద్యములు పాఠకుల మనములందుఁ దమదేశభాషలపై సద్భావములఁ బెంపొందఁ జేసి యాంధ్రాభ్యుదయమునకుఁ జేయూఁతనొసంగు నుద్దేశముతో వ్రాయఁబడినవి. మచ్చున కొకపద్యము.

సీ. శకవత్సరారంభ శాలియా శాలివా
  హనుఁ గనినట్టి దీ యాంధ్రభూమి
అఘటనఘటనాపటుఘనధీబంధురుఁ
  డల యుగంధరుఁగన్న దీయాంధ్రభూమి
ఆంధ్రావనీ పాలనావతారుఁడు జిష్ణుఁ
  డౌ కృష్ణుఁ గనిన దీ యాంధ్రభూమి
పాండితీజితవచఃపతి రఘునాథరా
  యలఁ గాంచినట్టి దీ యాంధ్రభూమి
మఱియు నెందఱినెందఱో మహితయశుల
నతుల కవితావిహారసంతతులఁ గాంచి
యమలకీర్తిని గన్న దీ యాంధ్రభూమి
యాంధ్రుఁడా! నేఁడు నినుఁజూచి యాక్రోశించు.

10. విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము ద్వితీయభాగము.

శ్రీ చిలుకమర్తి అచ్యుతరావు, ఎం. ఏ. ఎల్. టి గారిచే రచింపఁబడినది. వెల రు 2-0-0 గ్రంథకర్త యీగ్రంథమును శ్రీ శ్రీ శ్రీ పీఠికాపుర మహారాజుల కంకితమిచ్చిరి. ఆంగ్లమున శ్రీ వారు రచించిన పీఠిక గ్రంథకర్తలను బ్రశంసించుచు నీగ్రంథము నలంకరించుచున్నది. ఆంధ్రవాఙ్మయచరిత్రమును వ్రాసి పెక్కుగ్రంథములఁ బరిశోధనమొనర్చి శ్రీ వీరేశలింగము పంతులుగారును, శ్రీ రామమూర్తిగారును వాఙ్మయచరిత్ర రచయితల కాదర్శప్రాయముగ గ్రంథరచనమొనర్చి యుండిరి. వారి యనంతరము పలువురు తమతమగ్రంథముల రచించియున్నారు. కాని యిప్పటికిని సమగ్రముగు వాఙ్మయచరిత్రనిర్మాణము జరిగియుండ లేదు. ఈశతాబ్దియందు దండిగను వలయు పరికరములు, శాసనాదికములు లభించినవి; పెక్కు విమర్శకవ్యాసములు బయలుదేఱినవి. నన్నయకుఁ బూర్వమునఁగల యాంధ్రభాషాస్వరూపమునుగూర్చియు, నాఁటి వాఙ్మయమును గూర్చియుఁ బలువురు చర్చించియున్నారు. శ్రీ అచ్యుతరావుగారాంధ్రలోకమునకుఁ జిరపరిచితులగు విమర్శకులు. ఆంధ్రకవులను గూర్చిన వీరివిమర్శనవ్యాసములు పెక్కులు పత్రికలఁ బ్రకటింపఁబడినవి. వీరు విజయనగరవాఙ్మయచరిత్రమును బ్రకటించుటకు మొదలిడి యందు సంగమసాళువవంశముల నాఁటి వాఙ్మయచరిత్రమును బ్రథమ భాగముగఁ బ్రకటించియుండిరి. తుళువవంశము నాఁటి వాఙ్మయము రెండు మూఁడు భాగములుగఁ బ్రకటించుచున్నారు. ఈ రెండవభాగమున కృష్ణరాయల కాలము నాఁటి ముఖ్యములగు కవీశ్వరులగు పెద్దన, తిమ్మన, మల్లన, ధూర్జటి కవులను గూర్చియు విపులముగఁ జర్చించియున్నారు. వారి కేలికయగు కృష్ణరాయల చరిత్రము, నతని యాముక్తమాల్యదయు మూఁడవయధ్యాయమున విమర్శింపఁబడినవి. తుళువవంశపు చరిత్రము ప్రథమాధ్యాయమున వాఙ్మయచరిత్రమునకు వలయు నట్టిది

దిఙ్మాత్రముగ నీయఁబడినది. తుళువనరసింహారాయల కాలపు గ్రంథమగు మాడయ్యకవి మైరావణచరిత్రము ద్వితీయాధ్యాయమునను, తెన్నలకంటి సూరన్న విష్ణుపురాణము యెనిమిదవ యధ్యాయమునను జేర్పఁబడినవి. గ్రంథకర్త లాయాకవులను గూర్చియు, వారికి సంబంధించిన వాఙ్మయచరిత్రాంశములను గూర్చియు విపులమగు ప్రకరణముల రచించియున్నారు. వారి యభిప్రాయములలోఁ గొన్నిటిని మన మంగీకరింపకపోయినను, వారి కార్యదీక్షయు, భాషాభిమానమును బ్రశంసింపవలసి యున్నవి. పత్రికలయందు రచింపఁబడిన విమర్శకవ్యాసములకుఁ బూసగ్రుచ్చినరీతిని బ్రతివిమర్శన మొనర్చుటకుఁ దలపెట్టినచో గ్రంథములు పెరుఁగుటయేగాక చదువుటకు విసువు పుట్టింపకమానవు. వాఙ్మయచరిత్రముల ముఖ్యవాదాంశములఁ గైకొని వాని విషయమై తమ యభిప్రాయము లిచ్చినఁ జాలును. మనుచరిత్రమునుగూర్చి వ్రాసిన విషయములతోఁ దనివిచెందక గ్రంథకర్తలొక యనుబంధమును గూడ రచించి శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారి వ్రాఁతలను విమర్శించిరి. కృష్ణరాయల భార్యలనుగూర్చి వీరు వ్రాసిన విషయములను జరిత్రకారులంగీకరింపక పోవచ్చును. విపులమగు చర్చలతోఁ గూడిన గ్రంథము లభిప్రాయభేదములకుఁ దావొసంగక మానవు.

మనుచరిత్రాది ముఖ్యప్రబంధములకుఁ గథాసంగ్రహము, మూలకథాసంగ్రహము, పాత్రముల ప్రత్యేకవిమర్శనములును ననవసరములని తోఁచెడిని. మూలగ్రంథములను అధ్యాయములను దెల్పి మూలాతిరిక్త వ్యతిరిక్తవిషయములఁ దెలిపినఁ జాలును. ఆంధ్రీకరణమునఁ గలవింతలఁ దెలుపుచో మూలశ్లోకములు నీయవచ్చును. కృష్ణరాయల యాముక్తమాల్యదనుగూర్చి పెద్దన యాగ్రంథమును రచింపలేదని వీరు చర్చించి నిర్ణయించినది సమంజసమే. అయినను పెద్దనాదులు దాని నచ్చటచ్చటఁ బరిష్కరించి యుండవచ్చునని యొక చోటను, గురువులముఖమున తత్త్వసంప్రదాయముల నేర్చికొని 'తాను పద్యరూపమున నల్లి కాని, లేక వారిచే

వ్రాయించికాని తన గ్రంథమం దిమిడ్చికొని యుండవచ్చునని మఱియొక చోటను వీరు వ్రాసిరి. అది ఆముక్తమాల్యదాకర్తయగు కృష్ణరాయలకుఁగాని, వాఙ్మయచరిత్రకారులకు తమకుఁగాని గౌరవము నాపాదింపదు. అట్టి వ్రాఁతలును నిరాధారములు. ఊహాజనితములు. రాజకవుల గ్రంథము లాస్థానకవులు రచింతురను ప్రవాదము నేఁటిదికాదు. గ్రంథకర్తృత్వమునుగూర్చి లాక్షణికగ్రంథప్రామాణ్యము నంగీకరింప వీలు లేదు.

శ్రీ అచ్యుతరావుగారు రాయాకవులను గూర్చి వ్రాయుచుఁ గథావిధానము, శైలి, భావము, రసపోషణము మొదలగువానిని విపులముగ విమర్శించి తమ యభిప్రాయములఁ దెలిపిరి. పెద్దన తిమ్మన రామరాజభూషణులలోఁ దరతమముల నేర్పఱుప యత్నించిరి. వారి యభిప్రాయములతోఁ బూర్తిగ మన మంగీకరింపక పోయినను, వారి విమర్శనవాక్యములు మన కాదరణీయములు; మహాకవులలోఁ దరతరముల నేర్పఱుప యత్నించినచో నిట్టి భేదాభిప్రాయములు తప్పవు. ఆయా గ్రంథముల ప్రాశస్త్యము, వాని దేశకాలములు, మూలానుసరణాదులు, ఇతివృత్తము మొదలగువానిపై నాధారపడియుండును. స్త్రీఋతువర్ణనాదులయందాధునికులకు రుచింపని యత్యుక్త్యాదికములు మనకవులు పదియవ శతాబ్దపు సంస్కృతవాఙ్మయముకృతుల నవలంబించుటచేఁ గలిగినవి. గొప్ప కావ్యములందును భాణాదులయందును శృంగార మతివ్యాప్తిని గాంచినది. అందులకు నాఁటి రాజాస్థానములు, సాంఘికజీవనము కారణములై యుండును. అట్లు గానిచోఁ దంజాపురమధురవాఙ్మయముల సమర్థింప నెవ్వరికి వీలుండును? ఆంధ్రవాఙ్మయము బయలువెడలు నాఁటికే సంస్కృతవాఙ్మయము క్షీణదశయందుండి కాళిదాసాదుల మార్గమును వీడి మాఱుత్రోవల నడచినది. అది కొంతవఱకు దేశభాషలఁ బ్రతిబింబితమైనది. విమర్శకు లట్టిపరిణామములను దేశకాలములను గుర్తెఱిఁగి విమర్శనముల నొనర్పవలసియున్నది. సాత్త్విక, రాజస, తామసకవు

లనియు, ఉపన్యాసకశైలి, సహజశైలి, పండితులను దృప్తిపఱచుటకై తెచ్చిపెట్టుకొనిన శైలి యనియు మొదలగు గ్రంథకర్తల విభాగము లాదరణీయములు గావు. ఘనచతురంతయాన మహాగ్రహార సన్మాన మున, కమలాబ్జముఖులు దేవేరులుగాఁ అను వానిని గూర్చి వీరు వ్రాసిన వాక్యములు విమర్శింపఁదగి యున్నవి.

గ్రంథకర్తలు చాల శ్రమపడి పెక్కువిషయములఁజర్చించి విజయ నగర వాఙ్మయచరిత్రమున రెండుభాగములఁ బ్రకటించిరి. మిగిలిన రెండుభాగములనుగూడఁద్వరలోఁ బ్రకటించి కృతకృత్యులయ్యెదరుగాక.

11. సాంప్రదాయికవిజ్ఞానం (పాతపాటలు)—మొదటిభాగం ఏకు మళ్ళ కామేశ్వరరావుగారిచేఁ గూర్పఁబడి ప్రకటింపఁబడినది. సాంప్రదా యిక విజ్ఞానముయొక్క ప్రాముఖ్యతనుగూర్చి వీరు 1933 లో భార తిలోఁ బ్రకటించిన వ్యాసముకూడ నిందుఁ దిరుగనీయఁబడినది. ఆంధ్రమునఁ గల లోకోక్తులను, జాతీయములను, జానపదములను సమకూర్చి ప్రచు రణమొనర్చుట యాంధ్రభాష కత్యంతావశ్యకమని యందఱు అంగీకరించిన విషయమే. వాఙ్మయమున వానికిఁ గల స్థానమును గూర్చిన చర్చలనవస రము. ఇట్టి పదములను సేకరించుటలో శ్రీ నేదునూరి గంగాధరము గారు మున్నగువారు తీవ్రప్రయత్నముల జరుపుచున్నట్టులఁ దెలియు చున్నది. వారివారి ప్రయత్నములు శ్లాఘనీయములు. గ్రంథకర్తలును మిగిలిన భాగముల నచిరకాలమునఁ బ్రకటింతురుగాక.

12. కలువలు- 13. పాలపిట్ట- 14. మిణుగురుపురుగు.

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావుగారు రచించిన ఖండకావ్యముల సంపుటములు. ఇందు మొదటిది 'గ్రాంథికలక్షణాలలోవున్న ఖండకా వ్యము,లని వారే తెలిపియున్నారు. మిగిలినవి వ్యావహారిక భాషలో నున్నవి. అందు 'పాలపిట్ట' 'మిణుగురుపురుగు'లోని గేయములు బాలుర కొఱకుద్దేశించినవి. యమకింకరులవలెఁ గన్పడు నుపాధ్యాయులు భారత భాగవతపద్యములు, సంస్కృతశ్లోకములు వల్లె వేయించెడి పూర్వపు

విద్యావిధానము సచ్ఛక నపేనులు బాలుర కానందమును గూర్చుటకై రచించిన గీతములఁట! ఇందలి సత్యాసత్యతలను, యానందదాయకత్వమును, ప్రయోజనమును బాఠకులు విమర్శింతురుగాక.

గ్రంథకర్తలు తమ 'కలువల' కుపోద్ఘాతమును వ్రాయుచు 'ఇప్పటి పద్యకావ్యశైలి సామాన్యంగా సంస్కృతమని నాఅభిప్రాయం. తెలుగుకవిత్వం తెలుగుభాషలోనే చెప్పాలి-తెలుగులిపిలో రాసే సంస్కృతంలో కాదని' వ్రాసిరి. వీరియభిప్రాయము కవిత్వమునదీర్ఘములగు సంస్కృత సమాసము లుండరాదనియేయగును. అట్లుగాక సంస్కృతపదములను, తత్సమ తద్భవములను వదలి, యచ్చతెనుఁగుననే కవిత్వమును రచింపుచున్నచో నట్టిరచన లెట్లుండునో పాఠకు లూహింతురుగాక. పది శతాబ్దములనాఁటి సంస్కృతభాషాసంబంధమును త్యజించుట కష్టసాధ్యమనియే మాతలంపు.

15 కోపదారి మొగుడు—ఇదియొక సాంఘిక నాటకము. శ్రీ కేకుమళ్ల కామేశ్వరరావుగారిచే రచింపఁబడినది. సంఘసంస్కరణార్థ మీగ్రంథమును రచించితిమని వారు పీఠికలో వ్రాసియున్నారు. ఇది వ్యావహారిక భాషను రచింపఁబడిన అయిదంకముల వచననాటకము. సంభాషణమున కనుగుణమగు సులభమైన శైలిని గలిగియున్నది. ఇందు స్కూళ్ల యిన స్పెక్టరు శంకరశాస్త్రి యకారణమగు కోపమును దెచ్చికొని భార్యను హింసించుటయు, యవమానించుటయు, మొదటి రెండంకముల వర్ణింపఁబడినవి. అతనిభార్య చిట్టెమ్మ పతివ్రతయగుటచే సహజమగు సహనమును వహించి తుదకు జ్వరముచే మరణించును. ఇది మూఁడవయంకము. సంఘమునఁగల మిగిలిన యాచారములు, విధవావివాహములు, ఉద్యోగుల లంచగొండితనము, అమ్మలక్కల సంభాషణములు, వర్ణవ్యవస్థ, యందులకుఁ గారణము, స్త్రీవిద్య మొదలగు పెక్కువిషయము లాయా పాత్రల సంభాషణములఁ జర్చింపఁబడినవి. ప్రథమ ద్వితీయాంకముల యందే గ్రంథమున ముఖ్యవిషయము వర్ణితము. మిగిలిన చర్చలచే

వస్త్వైక్యము కొంత చెడినదని యూహింపవలసియున్నది. గ్రంథముచివర శ్రీరామమూర్తి పంతులుగారికిని గ్రంథకర్తలకును భాషనుగూర్చిన యభిప్రాయభేదములు దెలుపఁబడినవి. అట్టివి వ్యావహారికభాషకు సహజములే. నియమముల నేర్పఱచుకొనక నెవరికిఁ దోఁచినరీతిని వారువ్రాసినచో భాష భిన్నత్వమును జెందుటయేగాక యపభ్రంశముల కాలవాలమగును. శ్రీరామమూర్తి పంతులుగారి మార్గమునుగూడ వ్యావహారికభాషావాదులు వీడియుండుటచే వారు తమభాష క్రిందటి శతాబ్దము నాఁటిదని వ్రాసికొనవలసి వచ్చినది.

16 భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిలుగారి సమ్మాన సంపుటము—

త్రిలిఙ్గపత్రిక రజతోత్సవమున నీసంచిక ప్రకటింపఁబడినది. శ్రీ వేంకటేశ్వరశాస్త్రిలుగారును వీరితండ్రిగారగు శ్రీరామస్వామిశాస్త్రిగారును ప్రాచీనాధునాతన గ్రంథముద్రణమువలనను త్రిలిఙ్గాది పత్రికలను నడపుటవలనను ఆంధ్రభాషకుఁజేసిన యపారమైన సేవ వాంధ్రలోకమంతయుఁ బ్రశంసింపవలసియున్నది. క్రీ శ. 1854 లోనే ముద్రణాలయము నేర్పఱచి, ముఖ్యగ్రంథముల నచ్చొత్తించి శ్రీరామస్వామిశాస్త్రిగారు C. P. బ్రౌను మున్నగు మహనీయుల ప్రశంసను బడసిరి. వీరి సేవనుగూర్చిన ముఖ్యవిషయములన్నియు గ్రంథమున కుపోద్ఘాతమున నీయఁబడినవి. పండితులు, ఉన్నతోద్యోగులు, భాషాభిమానులు తమ సందేశములను, ఆశీస్సులను గద్యపద్యరూపమున నుత్సవ సందర్భమునఁ బంపిరి. అవియన్నియు గ్రంథాంతమునఁబ్రకటింపఁబడినవి. అవిగాక సుప్రసిద్ధపండితవర్యులచే రచింపఁబడిన వ్యాసములు గద్యపద్యాత్మకములు మొదటిభాగమునఁ గలవు. ఈరజతోత్సవసంచిక సర్వాంగసుందరముగఁ జక్కని ముద్రణముతో వెలువడినది. శ్రీవేంకటేశ్వర శాస్త్రిగారు తమతండ్రితాతల మార్గమునఁ జేయుచున్న యాంధ్రభాషాసేవ నిత్యాధికముగ నొనర్చి యాంధ్రుల ధన్యవాదములను గ్రహించుచు జిరకాలము వర్ధిల్లుదురుగాక యని యాశించుచున్నాము.